


# కాంతం



శ్రీ మునిమాణిక్యం నరసింహారావు



# కౌంతం

రచయిత

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# అంకితం

నా జీవితానికి అంతా వెలుగై

ఈ కథలన్నీ వ్రాయటానికి నాకు

శక్తినీ, ఉత్సాహాన్ని ఇచ్చిన

నా అర్ధాంగికి

# కృతజ్ఞత



పదిహేనేండ్ల గార్హస్థ్యజీవితం ఆధారంగా తీసుకొని వృత్తం కల్పించి ఈ పుస్తకం వ్రాశాను. ఇందులోని కొన్ని విషయాలు ఇదివరలో కథారూపాన్ని పొందినై. కాని వాని మూల బీజాలే ఇందులో ఉండటంవల్ల చర్విత చర్వణ దోషం అంట లేదని నా నమ్మకం.

ఈ పుస్తకం అచ్చువేయించటానికి శ్రీ శ్రీపురం ప్రకాశరావు గారూ, చెరుకుపల్లి వెంకటప్పయ్య పట్టాభిరామయ్యగారూ, డి. యస్. శాస్త్రిగారూ (Central Bank) ధూర్జటి సుబ్రహ్మణ్యం గారు M. A. అయ్యగారి రామమూర్తి పంతులుగారూ ధన సహాయ్యం చేశారు. వారికి నేను ఎంతో కృతజ్ఞుణ్ణి.

చలంగారి "మ్యూజింగ్సు" లోని ఒకటి రెండు మధుర భావాలు నేను గ్రహించి స్వంతం చేసుకున్నాను వారికి గూడా కృతజ్ఞుణ్ణి.

మునిమాణిక్యం.

# మునిమాణిక్యం వారి కాంతం

భారత రామాయణాలలోని పాత్రలను విడిచిపెట్టితే ఆంధ్ర సారస్వతంలో సజీవమైన పాత్రలు చాలా తక్కువని ఒప్పుకోక తప్పదు. ప్రబంధాలలోని నాయికా నాయకులు భావనా ప్రపంచం లోని వారేకాని వాస్తవిక ప్రపంచానికి చెందిన వారు కారు. ప్రజలలో ఈ పాత్రలకు పలుకుబడి మిక్కిలి తక్కువ. జీవకళ, గూడా తక్కువే. వరూధిని, సత్యభామ, కలభాషిణి వంటిది కొందరిలో మాత్రం చైతన్యమూ, జీవకళా కనుపించుతవి. కాని వీరినైనా సామాన్య ప్రజానీకం అర్థం చేసుకోవడం కష్టం. వరూధిని అప్సరోభామిని సత్యభామ రాజకన్య; కలభాషిణి వేశ్యాంగన. అందుచేత, యీ ముగ్గురూ సామాన్య ప్రజలలోనివారు కారనే చెప్పవలయును. ప్రబంధాలలో చిత్రింపబడ్డ స్త్రీ పాత్రలలో ఒక్క నిగమశర్మ అక్కమాత్రం మనం ప్రతి దినం మన కుటుంబాలయందు జూస్తున్న స్త్రీల తరగతి లోనిది.

పూర్వ సాహిత్యంలోనే కాకుండా, ఆధునిక సాహిత్యంలో కూడా జీవకళతో విలసిల్లుతున్న పాత్రలు వ్రేళ్ళమీద లెక్కపెట్ట దగినవే. గిరీశం ఆధునిక నాగరికతా సంపర్కం ఆంగ్లభాషా పరిచయం కలిగిన వారిని మాత్రమే ఆకర్షించు తున్నాడు. పట్టణాలలోనే గిరీశం కనబడతాడు. గ్రామ ప్రాంతాలలోని జన సామాన్యంలో గిరీశం కనబడడు. గిరీశం హాస్యం కొంతవరకు

ఆంగ్లభాషాపదాలపైన ఆధారపడి వుంటుంది. పల్లెపట్టులలోని గ్రామీణులకు ముఖ్యంగా మా తెలంగాణ ప్రాంతాలవారికి గిరీశం అర్థం కావడం కష్టం. బారిస్టర్ పార్వతీశం కూడా పూర్తిగా కాకపోయినా కొంతవరకు ఇట్టివాడే. పార్వతీశం కథ లండన్ ప్రయాణంతో మొదలవుతుంది. లండన్‌లో పార్వతీశం హ్యాటు సంఘటనలోని హాస్యం అర్థం చేసుకోవడానికి ఒక విధమైన వాతావరణం అవసరం. యెంకి జీవితమే ప్రేమాభిరామని ఒక్కమాట చెప్పితే చాలు. ఆమె వ్యక్తిత్వం నిరూపించడానికి కాంతం వీరందరివంటిది కాదు. ఆమె సామాన్యసంసారిణి; అచ్చంగా తెలుగింటి ఆడుబిడ్డ. ఆంధ్రదేశంలో యే ప్రాంతంలోని యే గ్రామానికి వెళ్ళినా, మనకు కాంతం కనుపించి తీరుతుంది. ఆమె వేషభాషలు సకలాంధ్ర జనులకు అర్థమౌతవి. ఆమె హాస్యం మిక్కిలి సున్నితమైంది.

కాంతం జగదేకసుందరి అని చెప్పటానికి వీలులేదు. ఎందుకంటే ఆమె పల్లవపాణిగాని పద్మనయనగాని, రాకేందు బింబాననగాని కాదు. ఫేసుపవుడర్లు లిపుస్టిక్కులు, మున్నగు ఆధునిక సౌందర్యపోషణ పరికరాలను విలాససామగ్రిని, ఉపయోగించడంలో నేర్పుకలిగిన నవనాగరికురాలుగూడాకాదు కాంతం. భర్తమీద కోపంవస్తే "కలస్వనం" తో గాని "కలకంఠవధూకల" "కాకలీధ్వను" లతో గాని "కాంభోజి మేళ విపంచికా" స్వరంలోగాని యేడ్వగలిగిన సామర్థ్యం కాంతానికి లేదు. కాంతం టెన్నిసు ఆడలేదు. కారునడపడం చేతగాదు. తుదకు భర్తవెంట సాయంకాలంపూట కొంచంసేపు వాహ్యాళి

కైనా వెళ్ళలేదు. కాని యీసామర్థ్యాలన్నీ కలిగిన సతీమణుల కంటె యెక్కువ సమ్మోహనశక్తి ఉన్నది. ఆమెకు

బ్రోచిగూడా సరిగ్గా పెట్టుకోడానికి చేతగాని పల్లెటూరిపడుచు కాంతం. ఈనాటి క్రొత్తఫ్యాషన్‌లు కొన్ని ఆమె భర్తవద్దనే నేర్చుకున్నది.

కాంతం అంత పొడగరీకాదు. పొట్టీకాదు. చామనచాయ శరీరము, నవ్వుమొగము, చక్కని నేత్రాలు కలిగిన ఓమోస్తరు అందగత్తె. ఆమె, కొంత రూపురేఖలు, అందచందాలు, హావభావాలు, చదువు సంధ్యలు. సిరిసంపదలు, తెల్లచీరలమీదప్రేమ మల్లెపూలమీద మక్కువ.

తన భాధ్యతలు, కష్టసుఖాలు, బాగా గ్రహించగలిగిన సాధ్వి కాంతం. కాపురానికి వచ్చిన క్రొత్తలో తనను విడిచి, క్షణం ఉండజాలని భర్తను బుజ్జగించి, కాలేజికి పంపి, పాఠాలు చదివించి, పరీక్షలు ప్యాసుజేయించిన బాధ్యతగల వ్యక్తి ఆమె. కాలేజికివెళ్ళి వచ్చిన తరువాత. పెందలాడే భోజనంపెట్టి ఆమె భర్తను సక్రమంగా చదివించింది. కాపురానికి వచ్చిన క్రొత్త దినాలనుంచే, ఆమె భర్తను అదుపు ఆజ్ఞలలోనుంచి కొంగున ముడివేసుకొన్నది. తాను గీచినగీటు దాటకుండా భర్తకు శిక్షణ యిచ్చిన ఉపాధ్యాయురాలు కాంతమ్మ.

కాంతానికి ఇంగ్లీషురాదు. కాని భర్తతో ఆమె "మీరు ఇంగ్లీషులో మాట్లాడుతుంటే నాకేదో అర్థమైనట్లే వుంటుందండి, అని అంటుంది. అంటే భర్త మోము జూచి ఆమె ఆయన హృద్గతాభిప్రాయాలను తెలుసుకోగలదన్న మాట,

కాంతానికి భర్త ఇంగ్లీషు చెప్పించాలే నని అనుకున్నాడు. కాని ఎంతప్రయత్నం చేసినా అది సాధ్యం కాలేదు. ఆమెకునగల మీద వున్నంత ప్రేమ ఇంగ్లీషు మీద లేదు. కనీసం అమెచేత వార్తాపత్రికనైనా చదివించవలెననుకుంటే, అదీ నెరవేరలేదు.

కాంతం ఒక విధంగా చాలా అమాయకురాలనీ, ప్రపంచ జ్ఞానం బొత్తిగాలేనిదనీ చెప్పవచ్చును. ''రేపు యుద్ధం ఆపి నవరసులు ఒక గంటసేపు చవుకగా అమ్ముతారని'' యెవరో చెప్పితే పాపం ఆమె నమ్ముతుంది, నమ్మడమేకాకుండా, ఆ సమయానికి అక్కడికివెళ్ళి చవుక ధరకు నవరసులు తీసికొని రానందుకు భర్తనుకోపిస్తుంది. ఒకరోజు పిల్లవాణ్ణి ఉపాధ్యాయుడు దెబ్బనుకొడితే, ఆమె భర్తతో ''చూడండి ఆ మాస్టర్ చేతులెట్లావచ్చినాయో అనవసరంగా పిల్లవాణ్ణి కొట్టాడు. చైనా యెక్కడున్నదో చెప్పమన్నాడట. వీడు చిన్నవాడాయె ఎక్కడ పెట్టాడో, మరిచిపోయినాడు'' అని అంటుంది.

కాంతానికి నగలమీదవుండే కోరిక ఇంగ్లీషు చదువు మీద, వార్తాపత్రికలమీద లేదని ఇంతకుముందే చెప్పినారు. లంకాయాగం కుచ్చెలకథ మొదలైనవి కాంతం బాగా చదువుకున్నది. కుమారీశతకం నృసింహాశతకం గూడా చదువుకున్నది. ప్రహ్లాద చరిత్ర మొదలైనవి అర్థం తెలిసి చదువ గలిగేది.

శ్రీరాములు అయోధ్యలో వుండేవాడని ఆమెకు తెలుసు కొనీ వైసురాయి యెక్కడ వుంటాడో ఆమెకు తెలియదు. శ్రీరాములు దండకారణ్యానికి యేమార్గాన పోయినాడో ఆమెకు తెలుసు కా

మనం మద్రాసుకు యెట్లా పోవలెనో ఆమెకు తెలియదు. పంచాంగం చూచి తిథివార నక్షత్రాలు చెప్పగలదు. రైల్వేగైడు చూడడం ఆమెకు చేతగాదు.

అయితే కాంతం మంచి ఊహ తెలివితేటలూ గలది. భర్త పిల్లవాడిచేత గుర్రాన్ని గూర్చి కాంపొజిషన్ వ్రాయించితే, పిల్లవాడికి గుఱ్ఱాలనుగూర్చి గాడిదలనుగూర్చి పాఠాలు చెప్పుతా రండీ! అని ఆశ్చర్యపడుతుంది. భర్తను వేళాకోళం జేస్తుంది.

కాంతం మంచి పొదుపరి, భర్తజేబులో అవసరాని కన్న యెక్కువడబ్బు ఉండనీయకుండా జాగ్రత్తపడుతుంది.

ప్రపంచంలో సాధారణంగా స్త్రీలకు పుట్టింటిమీద మమకారం యెక్కువ. కాంతం యిందుకు అపవాదంకాదు. తనభర్త పూర్వీకులు, తన పూర్వీకులంత గొప్పవాళ్ళు కారని ఆమె అభిప్రాయం. సామాన్యంగా అందరు స్త్రీలవలె భర్త పరాయి స్త్రీ వంక కన్నెత్తి చూడడం కూడ, ఎంతమాత్రం యిష్టపడదు. భర్త యెవరో స్త్రీని ముద్దుపెట్టుకొన్నట్టు కలవస్తే ఆమె యెంతో అదుర్దాపడుతుంది.

కాంతం మంచిమాటకారి. ఆమె మాటల్లో సున్నితమైన హాస్యం, లలితమైన చాతుర్యం ప్రతిబింబిస్తుంది. కాపురానికి వచ్చిన క్రొత్తలోనే భర్తను స్వాధీనం జేసుకున్న నెరజాణ ఆమె ఒకనాడు వారిద్దరు ఆప్తులయింటికి వెళ్ళిరి. కాంతానికి వదినెవరుసగల ఆ యింటి యజమానురాలు యీ కొత్తదంపతులను పేరు చెప్పనిది గడపదాటి లోనికి రావద్దని సరసమాడింది. ఆ సందర్భంలో పరిహాసానికి ఆమెభర్త తన భార్యపేరు సుబ్బ

లక్ష్మి అని అబద్ధమాడెను. తరువాత గడుసరి యైన కాంతం కాఫీ, అతని చేతులమీద ఒలకబోసి ఇకముందు ఇట్టిపని చేయు వద్దని బుద్ధిచెప్పింది. ఆనాటిరాత్రి భోజనాలవద్ద జరిగిన మరొక మధురసం ఘటన కాంతం ప్రసంగ కుశలతకూ, మాటకుమాట బదులుచెప్పే నేర్పుకూ, రసికత్వానికీ మంచి నిదర్శనము, కాంతం భర్త ఆమెకన్న తొందరగా భోజనం ముగించి, యెవరూ చూడకుండా, పెరుగుచేతిని కాంతం బుగ్గలకురాసి వెళ్ళిపోతాడు. అప్పుడు ఇది కనిపెట్టిన వదినగారు "ఏమె పిల్లా అదేమి ఆగడమే, పెరుగు బాగుంటే ఇంకా రెండుముద్దలు తినాలిగాని బుగ్గలకు రాసుకుంటారా" అని హాస్యమాడితే వెంటనే కాంతం "మీతమ్ముడు సరిగ్గా తినకుండ లేచిపోయినాడు. చూశావా, వదినా, వారికొరకే కాస్త బుగ్గలకు పూసుకున్నాను" అని బదులుచెప్పి సమయస్ఫూర్తిని ప్రకటించింది.

ఎంత కోపంలోవున్నా నవ్వించగల మాటపొందిక కాంతానికి పెట్టనిసొమ్ము, దెబ్బ తగలకుండా హాస్యం ఆడటంలో కాంతానికి పెట్టిందిపేరు. ఒకరోజు భర్త "మీ చెల్లెలు ఒకకోతి, మీ అక్కయ్య మరొకకోతి, తోకలుమాత్రం లేవు" అని ఎగతాళి చేస్తే ఆమె ఏమాత్రం తడుముకోకుండా, "మీ చెల్లెళ్ళకు ఆలోటూలేదు" అని జవాబు చెప్పుతుంది.

ఇంకొకసారి జరిగిన సంఘన యేమనగా దంపతు లిద్దరి మధ్య ప్రణయకలహం వచ్చింది. మూడు రోజులు మాట్లాడుకో లేదువారు. అయితే యీ పరిస్థితి ఇద్దరికీ దుర్భరంగానే ఉన్నది. ఈ సందర్భంలో ఒకరు మేడమీదికి పోతూ మరొకరు మేడ

క్రిందికి వస్తూ వారిద్దరు యెదురుపడడం తటస్థించింది. మేడ మెట్లు మిక్కిలి యిరుకైనవి. ఒక మారు, ఒక్కరే వెళ్ళగలరు. ఆ మెట్లమీద కొంతసేపు ఇద్దరూ అల్లే నిలబడ్డారు. ఒకరు మరొకరు తప్పుకోవలెనని ఆశించుతూ, ఎవ్వరూ తప్పుకోలేదు. అప్పుడు కాంతం "కొద్దిగా దారి యివ్వండని" అడుగుతుంది. ఆయన నేను ఫూల్సుకు దారి యివ్వనంటాడు. వెంటనే ఆమె "అయితే నేనుమాత్రం" యిస్తానని చెప్పుతూ దారియిస్తుంది. మరొకమారు భర్త "నేను వొట్టి తెలివితక్కువ వాడిననా, నీ అనుమానం" అంటాడు. "ఆహాఁ, హాఁ, హాఁ, అనుమాన మేమీలేదు. గట్టినమ్మకమే" నంటుంది. మాటలమూటయైన కాంతం ఇంకోసారి ఇంటిలోని పాడిగొడ్డు పోట్లమారిదైనందున అమ్మివేస్తా నంటాడు భర్త. అప్పుడు కాంతం "పాడిగొడ్డును అమ్మకసంటారండీ పోట్లదైనంతమాత్రాన ఇంతకూ, ఆమాట కొస్తే నేను మిమ్మల్ని పెట్టుకొని కాపురం చెయ్యలేదండీ యిన్నాళ్ళు" అని అంటుంది. కాంతం మాటకారి తనానికీ, ప్రసంగకుశలతకూ, హాస్యోక్తి చాతుర్యానికీ, ఇట్టి సంఘటనలు ఎన్నైనా చూపించవచ్చును.

కాంతం జీవితమే ఒక లలిత మధుర శృంగార కావ్యం. కార్యం గాకముందు ఒకనాడు భర్త ఆమెను ఒంటరిగా కలుసుకొని కౌగలించుకుంటే, చెంపమీద మృదువుగాను గొట్టి, మందలించిన, మధురమూర్తి కాంతం. ప్రతిదినం రాత్రి భర్త కూర్చున్న కుర్చీకి సరిగ్గా వెనుకనున్న గూట్లో స్నోబాటిల్ వెదికే నెపంతో అతని భుజాలమీద చెయ్యివేసి, అవసరం లేక

పోయినా కొద్దిగానొక్కి, తన వక్షస్థలం అతని చెంపకు తాకించి, భర్తను రంజింపజేసే, చతుర శృంగారవతి కాంతమ్మ. తన బహుకాల తపఃఫలమని యీ మేనుజూచి కాంతం విధేయుడైన భర్త మురిసిపోతాడు.

మొదటిరోజుల్లో, ఆమె తన తనుద్యుతి కుటిలాలకాలు సుదీర్ఘ నీలశిరోజాలు, ముఖవికాసంచేత భర్తను ఆకర్షించినది. యవ్వనపు పొంగు కొంత చల్లారి, పిల్లల తల్లియైన తరువాత ఆమె, తన స్వభావం, ప్రవర్తన, ప్రేమా, చమత్కార సంభాషణా, మొదలయిన గుణాలచేత భర్తను వశీకృతుణ్ణి జేసుకున్నది. దాంపత్యంలో ఉండే విలువకు కాంతం జీవితం ఒక మంచి నిదర్శనం.

అసంతృప్తి ఆమె జీవితంలో యెక్కడాలేదు. జీవితం అంతా త్యాగమే ఆమెకు. భర్తకూ, పిల్లలకూ, సేవజేయడంలో తన సుఖమూ, సౌందర్యమూ, యవ్వనమూ, అన్నీ త్యాగం జేసిన ధన్యజీవి ఆమె.

"చీకటిలో దేవులాడుతున్న నా బ్రతుకుకు ఆమె ధృవతార: హృదయక్షేత్రానికి అమృత వాహిని" "నా సహోదరి, భార్యా అన్నీ ఆమెయే" నని భర్తచేత మెప్పులు పొందిన కాంతానికి జీవితంలో తృప్తిలేకపోవడమనే సమస్య యెన్నడూ కలుగలేదు.

గృహమే భూతలస్వర్గముగా ఆమె మార్చింది. ఆదర్శ గృహిణియైన మునిమాణిక్యంవారి కాంతం తెలుగు నాయికలలో మాణిక్యం వంటిది. మన పూర్వులు చెప్పిన షడ్ధర్మ యుక్తా

కులధర్మపత్నీ అన్న సూక్తి ఆమె యందు అక్షరాలా వర్తింప తుంది.

కాంతం భర్త చెప్పినట్లు, ఎంతటి బుద్ధిహీనుడో కదా, ఆ భగవంతుడు, తాను నిర్మించిన సుందరభవనంలో వుండే అతి సుందరవస్తువునే కూల్చినాడు.

(హైదరాబాదు రేడియో సౌజన్యంతో)

—శ్రీ దేవులపల్లి రామానుజరావు.

# మంజీదీపిక

ఆంధ్ర కథక లోకంలో మునిమాణిక్యం మునిమాణిక్యం. ఆంధ్ర గృహానికిది లోవెలుంగు దివ్వె. ''కాంత'' మీ దీప కళికకు మైనపువత్తి, ''కాంత'' ముద్బోధిస్తే కళ ఉద్భవిం చింది. కళాజిజ్ఞాస, ''కాంతం'' విలాసం, కలిసి ఎన్నడో మునిమాణిక్యంలో ఒక మధురిమను వెలికి తిగిచినవి. ఇప్పటికి ఆంధ్రదేశంలో సూర్యుడు వంగి వంగి ప్రవేశించిన ప్రదేశా లన్నీ ''కాంతం'' తొంగి తొంగి చూచింది అందుచే ''కాంతం''కు ఇది తొలిపలుకు గాదు; తుది పలుకే!

## కాంతం

నాయకుల్లో ''గిరీశమూ'' ''పార్వతీశమూ'' నాయికల్లో ''ఎంకి'' ''కాంతమూ'' ఆధునికాంధ్ర సారస్వతంలో చిరస్థాయి కుదుర్చుకున్నారు. కులము తక్కువైనా గుణమెక్కువ చిలి

కింది మెంకి. కాంతమునకు కులమూ గొప్పదే గుణమూ గొప్పదే! పద్యవాఙ్మయంలో రామకృష్ణుని చేతి నిగమశర్మ అక్కఅటూ, గద్యవాఙ్మయంలో మునిమాణిక్యంచేతి కాంతం ఇటూ, ఆంధ్రగృహిణుల కచ్చమైన ఆదర్శాలు, కలపము లభినవగంధాలుగా గూర్చి తనువున అలఁదికొని, మృగమద పంకము మృదువుగా సారించి తిలకం పెట్టుకొనే అంతఃపుర కాంత కాదు కాంతం. సాదాగా సాదుబొట్టు దిద్దుకొని, కిల కిలా నవ్వే మల్లెపూలచెండు తురుముకొనే ఓమోస్తరు అందకత్తె మాత్రం. మొదట జుట్టు విరబోసికొని వీధిలో ఎగిరే పిల్లయే పూతకు వచ్చిన మామిడిగున్న అయింది; ఈన అజమాయిషీ క్రింద ఆయన్ని చదివించే ప్రోఢ అయింది. సరిగమల్లో ఇమిడిన మాధుర్యంతో కృష్ణకర్ణామృతము, అధ్యాత్మరామాయణము, ఆంధ్రభాగవతము చదివే ఆదర్శసతీమతల్లి అయింది. ఈమెలో ప్రౌఢిమకన్న మాతృత్వమూ, అహంకృతికన్న చమత్కృతీ ప్రధానాలై పన్నిదాలు చఱచుకొని యించుమించై పఱుగులు తీస్తుంటయి. మునిమాణిక్యం బ్రతుకంతా ఇట్టి కాంతం చుట్టూతిరిగే దాగుడుమూతలాట అయింది. నాడూ నేడూ ఆయన గృహజీవనమూ, కళాజీవనమూ కాంతం కనుసన్నలోనే తిరుగుతున్నయి.

## హృ ద య ం

ఈయన హృదయం కవిహృదయం; భావాలు పాలతరగలూ పూల బుంగళ్లూ, "మల్లెపూవును నిర్దయతో కోసి సూదితో

గ్రుచ్చి ఎంతబాధపెట్టినా సాయంత్రానికల్లా బాధలన్నీ మఱచి పోయి హృదయాన్నంతా విచ్చి వికసింపజేసి పరిమళాన్ని వెద జల్లుతుంది. కాంతమూ అంతే!" "ఆమె పడుకున్న శయ్య పదిహేనుఏండ్ల సౌఖ్య జీవితాన్ని జ్ఞాపకం చేసింది." "ఆ పుల కలు నా జీవితం అంతా అల్లాగే ఉండిపోతయి అనుకొన్నాను," ఏతాదృశములైన పలుకుబళ్ళు పేశలమైన కవిహృదయాన్ని పట్టియిస్తున్నయి. మధురాతి మధురానుభూతి సువ్యక్తమై మనస్సునకు తోచినప్పుడు కవి హృదయ మల్లా పరితపించడం సహజం. కాంత మున్నంతవఱకూ వేళాకోళాలతో శృంగారాన కేరింతలాడిన యీయన హృదయం కాంతా నిర్గమనానంతరం కరిగి సురిగిన తరుణరసంలో ముచ్చమునిఁగి మునుకలాడింది, ఏది వచ్చినా పట్టలేదా పేదగుండె.

## హాస్యం

రసికులు కొందఱు వీరి రచన హాస్య ప్రధానమంటారు. శృంగార మంగిగా హాస్య మంగంగా తీర్చిన ప్రాచీన దృశ్య కావ్యాలు హాస్యప్రధానములా! అంగి కంగం సంబంధికావలె. శృంగారానికి హాస్యమే సంబంధి. హాస్యము వికృతి యని చమత్కృతి యని ద్వివిధము. ఈయనది కేవలం చమత్కృతి హాస్యం. పదాలు గుదికట్టికొంతా కుదిలించికొంతా విదిలించే కట్టుహాస్యమూ కాదు. జాతినో వ్యక్తినో నొవ్వించి నవ్వించే కుట్టుహాస్యమూ కాదు. వికటవాక్యాలను విపరీతోచ్చారణ చేసే విదూషకుల పొట్టుహాస్యమూకాదు. రసార్ద్రమైన మన

స్పుకు ప్రసాదమిచ్చే శీతలమరంద నిష్యందం ఈయన హాస్యం. "అసలు నేను వట్టి తెలివితక్కువ వాడినని నీ అనుమానం" అన్నాడు భర్త........"అహఁహఁ, అనుమానం లేదండీ! నాకు గట్టి నమ్మకమే!" అని కాంతం ముఖంలో ముఖంపెట్టి నవ్వింది........"ఎంతోసేపుకూడ కాలేదే! నాలుఁగయిదు నిమిషాల సంభాషణలో నన్నాయన ఫూల్ అన్నాఁడు" అని భర్త చెప్పగానే "అంత ఆలస్యం ఎందుకైందండీ!" అంది కాంతం. ఇలా దెబ్బతగలకుండా హాస్యమాడడంలో కాంతాని కెంతపేరో, రచన చెయ్యడంలో మునిమాణిక్యాని కంతపేరు. ఈయన హాస్యంలో మరో గుణముంది. హాస్యరచనలో ఎన్నడును తన్ను క్రిందుపఱచుకొని పరుల పైకెత్తునే గాని తానొక్కమాటైన పైచేయి యగుట కిచ్చగించడు. నిజానికి నిత్యకృత్యహాస్యప్రసంగంలో నిరంతరమూ ఆయనదే అందెవేసినచెయ్యి. లోకజ్ఞాన విషయంలోమాత్రం కాంతం క్రిందైె మన జాలిని చూఱగొంటుంది. మునిమాణిక్యం మీదై ముసిముసి నవ్వులు ముంపులుచేస్తాడు. ఒక చిన్నతార్కాణ.........కాంత మన్నది "ఆ మాస్టరుచేతు లెల్లా వచ్చినయ్యో! అనవసరంగా కొట్టాడుటండీ పిల్లవాణ్ణి. చైనా ఎక్కడుందో చెప్పమన్నాడు. వీడు చిన్నవెధవాయె! ఎక్కడపెట్టాడో యేమో మఱచిపోయినాఁడు కామాలు. చెప్పలేకపోయినాడు" అని.

## సూత్రాలు

భార్యాభర్తల ధర్మాలు సూత్రీకరించీ క్రోడీకరించీ చేసే రచన కాదీయనది. కాని, అందొకటి చెప్పి ఒకటి వదలలేదు,

"చిన్నదై ఉన్నప్పుడు మా ఆవిడ నాకేమంత అందమైన మనిషి లాగ కనిపించేదికాదు....ఒక్కొక్కప్పుడు 'ఫరవాలేదు. మా కాంతం సుమారైన అందకత్తె' అని అనుకొనేవాడ్ని" ఇది భర్తల ధర్మం. "భర్త సుందరమూర్తి అని భ్రమ కల్పించుకొన్నది. ఆ భ్రమతోనే ఆనందంగా తృప్తితో భూమిమీఁద ఉన్న నాలుగురోజులూ కాలం గడిపింది. లేనిపోనిది. ఎక్కడా దొరకని అసత్యమైన సౌందర్యంకోసం అన్వేషించి దాన్ని పొందలేక ఏడవలేదు" ఇది భార్యాధర్మం. హిందూమత సంప్రదాయ సిద్ధంగా వివాహ మొకానొక పవిత్రకర్మ, వట్టి ఒడంబడిక కాదు. బహుజన్మకర్మ పరంపరా సంబంధి గార్హస్థ్య కల్పకానికిది తల్లివేరు. ఆధునిక నాగరక వాతావరణములో కుంకటి వేరు తెగి కూలిపోతున్న యీతరువు మునిమాణిక్యం చేతిలో ప్రోదిసెంది పాతుకుంది. చిగిర్చి రెమ్మలుక్రమ్మి కొమ్మలుసాగి అందాలు చిమ్మింది........

ధర్మసూత్రాలే కాదు "కామసూత్రాలు కూడ తెలిసినయి కాంతానికి చదువుకోపోయినా, చదువుకోకుండానే తెలుస్తయి యువస్కి" "ఆవిడ, ఆయన బుజాలమీద చెయ్యివేసి అవసరం లేకపోయినా కొద్దిగా నొక్కి ఆమె వక్షస్థలం ఆయన చెంపకు తాకించి నానావస్థా పడితేగాని ఆ నోటిబాటిలు బయటపడేదిగాదు"........వెన్నెల్లో తెల్లని పాన్పుమీద శరద్రాత్రి అంతా గడిపి తూర్పుపేకలు తెల్లవారే సమయాన లేవబోతున్నప్పుడు వద్దువద్దని హత్తుకునే కాంతం గాఢ సంశ్లేష

ఆయనకు జ్ఞాపకం వస్తూఉంటుంది" కార్యాన మంత్రి, సేవలో దాసి, సెజ్జపై రంభగ కాంతం సర్వధర్మాలూ నిర్వహించింది.

ఇంతేగాదు. ఈయన ప్రాసంగికంగా సూచించిన ధర్మ రహస్యాలు కొన్ని ఉన్నయి. ఒకటి తిలకింపండి. "అవయవములు తట్టుకోలేని శక్తిమంతమైన యౌవనంలోనూ అందం ఉంది. ఆ పొంగు పోయిన తర్వాత జీవితానికి వచ్చే తృప్తి, గాంభీర్యము, శాంతము వీటిలోనూ అందం ఉంది."

## శై లి

సంప్రదాయసిద్ధంగా సంస్కృతమునూ, అసంప్రదాయసిద్ధంగా ఆంగ్లమునూ తెలుగు గడప మెట్టినతర్వాత పురుషుల వ్యవహారంలో దేశీయాలు జాతీయాలు వెనుకబట్టినయి. వంటయింటిలోనూ, పడకటింటిలోనూ ఇవి ఇంకను నిలిచి ఉన్నయి. ఇవన్నీ ఈ 'కాంతం'లో చక్కగా దీపిస్తున్నయి. తెనుగు సంప్రదాయాలు పన్నిదాలు వేసికొని అల్లిబిల్లిగా అల్లుకొన్న తీవఁజొంపాలపై క్రొవ్విరులలాగ తెకతేరవిచ్చి వెలుఁగులు వెల్లిపోస్తున్నయి. విస్తరభీతిచే వివరింపదలఁపను.

సర్వతోముఖమైన యీ పూఁదేనెసోన పిపాసువుల హృదయాల్లో తియతీపు లూరిస్తుందిగాక!

బందరు
18–9–44

—పువ్వాడ శేషగిరిరావు.

# కాంతం

## 1

మా కాంతం అంత పొడగరీకాదు పొట్టీకాదు. పెద్ద రూపసి కాదు. కాని ఓ మోస్తరు అందకత్తె. ఆమె శరీచ్ఛాయ బంగారు పసిమిగాదు చామనచాయ, నవ్వు మొగము. చక్కని నేత్రాలు. ఆమె కన్నులలో దివ్యజ్యోతి కనబడుతూ ఉండేది.

మా కాంతానికీ నాకూ బహు చిన్న తనంలో వివాహం అయింది. చిన్నదై ఉన్నప్పుడు మా ఆవిడ నా కేమంత అందమైన మనిషిలాగ కనిపించేదికాదు. అప్పుడప్పుడు నేను అత్తవారింటికి వెడుతూ ఉండేవాడిని. అల్లాంటప్పుడు ఆమెను చూస్తూ ఉండేవాడిని. ఒక్కొక్కప్పుడు ఫరవాలేదు మా కాంతం సుమారైన అందగత్తె అని అనుకొనేవాడిని.

చూస్తూ చూస్తూ ఉండగానే, ఆ పిల్ల ఓణీలు వేయటం సాగించింది. నేనూ లాగులు వదిలేసి పంచెలు కట్టడం ప్రారంభించాను.

ఓ సంవత్సరాది పండగకు నేను అత్తవారింటి కెళ్ళాను, సాధారణంగా జుట్టు విరబోసుకొని వీధిలో ఎగిరే పిల్ల నాకు ఆ నాడు కనిపించలేదు. నేను హాల్లో కూర్చుని ఇటూ అటూ చూశాను. ఎక్కడా ఆ పిల్లజాడ కనుపించలేదు. మా బావ మరది అప్పటికి ఏడేండ్ల పసివాడు, వాడిని పిలిచి రహస్యంగా అడిగాను. "మీ చిన్న అక్కయ్య ఎక్కడుందిరా?" అని.

వాడు నా కేమీ జవాబు చెప్పకుండా లోపలికి పరుగెత్తికెళ్ళి "అమ్మా చిన్న అక్కయ్య ఎక్కడుందే?" అని వాళ్ళ అమ్మను అడిగాడు. ఆవిడగారు "ఎందుకురా నాయనా!" అంది. "బావ అడుగుతున్నా" డని చెప్పేశాడు. అప్పటి కింకా కార్యం కాలేదు. ఈ మాటవిని మా అత్తగారు నవ్వింది. మా మరదలు బయటకొచ్చి నన్ను జూచి, అవ్వ! – ఏమిటి బావా అది? అక్కయ్యతో ఏం పని నీకు? అని విరగ బడి నవ్వింది.

నాకు చాల సిగ్గేసింది. నేను గోడవేపు ముఖంపెట్టి మంచం మీద పడుకొని నిద్రపోతున్నట్లు నటించాను. మా మరదలు పోయి ఇంటి పక్కనున్న అరడజను పిల్లలను లాక్కొచ్చింది నన్ను చూపటానికి. వాళ్ళంతా లోపల చేరారు. ఏవో గుస గుస లాడుకొన్నారు. నవ్వుకొన్నారు. ఆ తరువాత ఒక్కొక్కరే వచ్చి నన్ను జూచి కడుపు చెక్కలయ్యేలాగున నవ్వుకొని వెళ్ళి పోయేవారు.

వీళ్ళు ఎంత నవ్వినా నాకు మట్టుకు మా కాంతాన్ని చూడా లన్న కోరిక పోలేదు. అప్పటికి రెండేళ్ళక్రింద చూశాను ఆ పిల్లను, ఇప్పు డెట్లాఉందో!! పెద్దమనిషి అయిన తరువాత పిల్లలు ఇట్టే ఎదుగుతారట! ఈ అమ్మాయి ఎంత ఎదిగిందో! బహుశః చీరలు కడుతూ ఉండవచ్చు! అని అనుకొంటూ అక్కడే పడుకొన్నాను.

నవ్వులు ఆగిపోయినాయి. ఎక్కడవాళ్ళు అక్కడ సద్దు కొన్నారు. సాయంత్రం నాల్గు గంటలైంది. కాస్త పల్లబడ్డది.

లేచి ఊళ్ళోకిపోయి గుక్కెడు కాఫీ తాగివద్దామా అని అనుకుంటూ కళ్ళుమూసుకొని పడుకొని ఉన్నాను, ఇంతలో గాజుల గలగలలూ, క్రొత్తచీర రెపరెపలూ వినిపించినై. దానితోపాటు మగువ పొలపు వెలుపునొక మారుతంకూడా సోకింది పారిజాత కుసుమ పరిమళ భరితమైనది.

అయితే ఎవరో కొత్తఆవిడ వస్తున్నది కాబోలు నన్ను చూసి నవ్విపోవటానికి అనుకొన్నాను. అందుకని కళ్ళు గట్టిగా మూసుకొన్నాను బాగా నిద్రలో ఉన్నవాడిలాగ.

ఆ వచ్చిన అవిడ ఎవ్వరోగాని, అందరిలాగ ఒక నవ్వు నవ్వి పోలేదు. అసలు నవ్వలేదు. అక్కడే నుంచుని ఉన్నట్లు నాకు అనుమానం కలిగింది. కొద్దిగా కళ్ళు తెరిచి చూశాను. ఎవరో పదహారు ఏండ్లపిల్ల! ఆవిడ ఏదో వస్తువకోసం ఆ హాల్లో వెదుకుతున్నట్లు నా ఊహకు తోచింది. బాగా కళ్ళు తెరిచి చూడటానికి భిడియం. ఎవరైతే మనకెందుకని కళ్లు మూసుకొనే వయస్సు కాదు నాది,

ఇంతలో ఆ అమ్మాయి నా మంచం వైపుకే నడవటం నేను చూశాను. ఎందుకో గుండె దడదడ కొట్టుకొన్నది. ఏదో ఆనందం కూడా ఉంది.

దాని తరువాత జరిగినసంగతులనుబట్టి తెలుసుకొన్న విషయం ఏమిటా అంటే ఆమె సొదు బరిణకోసం వచ్చిందట. ఆ బరిణ నామంచానికి ఇటు వైపున ఒక చిన్నబల్లపైన ఉన్నది. దాన్ని తీసుకోవాలెనంటె నాపైగా వంగి తీసుకోవాలె.

ఆ పిల్ల ఒక క్షణం ఆలోచించి, అటూ ఇటూ చూచి ఎవ్వరూ లేరని నిశ్చయించుకొని చటుక్కున నాపైన వంగి ఆ బరిణ

అందుకోబోయింది. ధైర్యంగా బాగా కళ్ళువిప్పి చూశాను మా కాంతమే. పొడుగు ఎదిగింది. వళ్ళుచేసింది. చాయ వచ్చింది. రెండేళ్ళల్లో అంతమార్పు ఎల్లాగ వచ్చిందో నేను ఊహించుకో లేకపోయినాను. పూతకొచ్చిన మామిడి గున్నలాగ తయారైంది. నును పైన రేకులు దట్టంగా బిగువుగా ఒక దానిని ఒకటి అంటి పెట్టుకొని ఉన్న మొగలి పొత్తిలాగుంది ఆమె శరీరం, స్త్రీ స్పర్శ తగలటం నాకు అదే మొదటిసారి, చంద్ర దర్శనానికి మహోదధి పొంగినట్లు నా హృదయం పొంగింది.

ఆమె తెల్లని మొగంపై ఒక చిరునవ్వు కనపడ్డది. క్షీరసాగ రంలో చంద్రుడు ఉదయించినట్లు అయింది. ఆమె నా వంక చూచింది వ్యాకరణానికి అతీతమైన ఆమె కన్నులలోని భాష నాకు అర్థమైంది, అప్రయత్నంగా నేను చేతులు చాచాను. నా ఆలింగనంలోకి ఆమె మెల్లగా జారింది. నేను మరింత గట్టిగా ఆమెను నా హృదయానికి హత్తుకొన్నాను. ఆమె సిగ్గుపడి నవ్వి. ముక్కుపైన వేలు వేసికొని 'తప్పు' అన్నది.

నేను చేసింది చాలా తప్పుపనట! ఎవరైనా చూస్తే ఏదో అంటారట!!

ఎవరేమన్నాసరే, ఆమెను వదలాలని నాకు బుద్ధిపుట్టలేదు. మరింత గాఢంగా కౌగలించుకొన్నాను.

ఇంతలో ఎవరో వస్తున్నట్లు అలికిడి అయింది. అయినా నేను అల్లాగే ఆమెను వదలకుండా ఉండటం జూచి, ఆపిల్ల చటక్కున నా చెంపమీద మృదువుగా కొట్టింది. నేను వదిలేశాను ఆ అమ్మాయి తుర్రున పారిపోయింది.

నా జీవితంలో అది దివ్యదినము. నావళ్ళు అంతా పులక రించింది. ఆ పులకలు నా జీవితం అంతా అల్లాగే ఉండిపోతయ్యి అనుకొన్నాను.

ఆ తరువాత కొద్దిరోజులకే ఆమె సతీత్వం స్వీకరించింది. మేము సంపూర్ణమైన అర్థంలో భార్యాభర్తలము అయినాము.

ఒక వెన్నెలరాత్రి ఆమె మాయింటికి రాణీ అయింది. ఆ రోజురాత్రి ఆమె తెల్లని చీరకట్టుకొని తెల్లని మల్లెపూలు జెడలో పెట్టుకొని. దొడ్లో ఆ వెన్నెలలో తిరుగుతూ ఉంటే జ్యోత్స్నాతరంగాలపై పుణ్యలోకాలనుంచి దిగివచ్చిన ఒక అప్సరః కన్య వలె కనపడ్డది.

## 2

అప్పటికి నేను బి.ఏ. రెండోసంవత్సరంలో ఉన్నాను. విజయనగరంలో చదువు. కాలేజీ తెరిచారు. ఇహ వెళ్ళాలె ప్రయాణం ఇంకా నాలుగురోజులు ఉంది అనగానే నేను మా నాన్నతో అన్నాను. నాన్నా విజయనగరంలో పూటకూళ్ళ ఇంట్లో భోజనం ఏమీ బాగుండటంలేదు అని. అదీకాక క్రిందటి సంవత్సరం బంక విరోచనాలు పట్టుకొని ఎన్నాళ్ళో వదలక బాధించినై కూడాను. ఆ సంగతి మానాన్నకు తెలుసు. మానాన్న ఏమీ మాట్లాడలేదు. వియ్యంకుడికి ఉత్తరం వ్రాసిఉంటాడు. ఎందుకంటే మూడోరోజు కల్లా మా మామగారు పిల్లను తీసుకొచ్చి మా ఇంట్లో దిగబెట్టివెళ్ళాడు.

"నాయినా విజయనగరంలో నీవు ఒక్కడవీ ఉన్నా నెలకు ఇరవై రూపాయలు కావాలె. ఆ ఇరవై పెడితే మీ ఇద్దరూ హాయిగా ఉండవచ్చు. కావలిస్తే ఇంకో నాలుగో అయిదో పంపిస్తాను. కోడలునుగూడా తీసికెళ్ళు" అన్నాడు మానాన్న ప్రయాణం రేపనగా. లోపల సంతోషంగా ఉన్నా పైకిమాత్రం ఇష్టంలేనివాడిలాగే నటించి "ఊ ఎందుకునాన్నా"—అని అన్నాను,

ఈ మాటలు విని మా ఆవిడ ఫక్కున నవ్వింది నేనూ కొద్దిగా నవ్వుకొన్నాను. ఇంకా ఎక్కువగా నటన చేయటానికి వీలు లేకుండాపోయింది. మర్నాడు ప్రొద్దున బండికే బయలు దేరాము విజయనగరంలో కొత్త కాపురం పెట్టటానికి.

మా నాన్న మమ్ములను రైలు ఎక్కించి కోడలుతో చెప్పాడు. "కాస్త కనిపెట్టి ఉండు అమ్మాయీ. వాడు కష్టపడి చదివి ప్యాసు అయినాడా, అంతా సంతోషిస్తాము"

మేము విజయనగరంలో ఒకమేడలో కాపురం పెట్టాము. క్రింద వంటగది ఉంది, పైన నేను చదువుకొనేగది. మా ఆవిడ క్రింద మసులుతూ ఉంటుంది. నేను పైగదిలో హాయిగానే చదువుకోవచ్చు ఆవిడతో ఏ సంబంధం లేకుండా. నా చదువు ఏమీ ఆటంకం కలగకుండా ఉంటానికి ఇల్లాంటి ఏర్పాటు చేశాను.

పగలల్లా కాలేజీలోనే సరిపోయేది. రాత్రిళ్ళు మా ఆవిడ అజమాయిషీక్రింద చదివేవాడ్ని. ఆవిడ నాకు పెందలాడే భోజనం పెట్టి ఇహ హాయిగా చదువుకోండి వెళ్ళి. అని చెప్పి పైకి

పంపించేది. పరీక్షలుకూడా దగ్గరకు వచ్చినై. కష్టపడి చదవాలె. అందుకని నేను శ్రద్ధగా చదవాలన్న నిశ్చయంతోనే వెళ్ళేవాడ్ని. కానేపు చదువుకొనేసరికి విసుగు కలిగేది. "ఇదుగో కాంతం, ఒక్కసారి ఇల్లా వస్తావా?" అని పిలిచేవాడ్ని. ఆమె వచ్చేదికాదు. తాను వస్తే నా చదువు ఎక్కడ పాడైపోతుందో అని ఆమె భయం. క్రిందినుంచే కోప్పడేది. "ఎందుకండి రావటం? చదువుకోండి" అంటూ.

నిజానికి ఎందుకూ ఆవిడ రావటం! ఏమీ పనిలేదు. ఈ సంగతి జ్ఞాపకాని వచ్చి, మళ్ళీ చదువుకొనేవాడ్ని. కాని కానేపటికి మళ్ళీ పిలవక తప్పేదికాదు. "కాంతం ఒక్కసారి రావాలె" "ఎందుకండీ" అనేది ఆవిడ. "ఎందు కేమిటి తెలియటంలా—ఈ కిటికీ ఇల్లాగ తీసిపెట్టా వెందుకూ" అని నేను కోప్పడితే ఆవిడ "కిటికీ తీసిపెడితే మీకు వచ్చిన ఇబ్బం దేముందండీ ఊరికేగోల! చదువుకోండి" అని మళ్ళీ అంటుంది.

ఎట్లాగ చదువుకోటం. ఆ సమయానికి ఉక్కగా ఉండేది. అందుకని ఆమె వచ్చి కానేపు విసిరితే హాయిగా చదువుకొందును. ఆవిడ రాదు.

ఉక్క లేకపోతే చలిగా ఉంటుంది. చలిగా ఉంటే ఆవిడొచ్చి శాలువ కప్పాలె. ఆ శాలువ ఎక్కడుందో నాకు అసలు కనబడదు. పరుపుక్రిందే ఉందండీ చూడండి. కనబడుతుందని అంటుంది కాని నాకు ఆ శాలువ ఎంతవెతికినా కనపడదు. ఆ సంగతి నాకు అసలు తెలుసు. అందుకని నేను వెతకనుకూడా వెతకను. ఆమెనే కేకలేస్తాను రమ్మని. నాచదువు ఎక్కడ పాడైపోతుందో అని ఆవిడగారు రాదు.

ఆ తరువాత పది నిమిషాలకు పైను ఎంత అయిందో అని గడియారంవంక చూస్తే పది అయిఉంటుంది. పదింటి కల్లా పడుకొని మళ్ళీ తెల్లవారుఝామున లేవటం మంచిదని మా నాన్న ఎప్పుడూ చెపుతూ ఉండేవాడు. తండ్రిమాట వినాలె. అందుకని వెంటనే పడుకొంటానికి నిశ్చయించుకొని పడుకొనేవాడిన్ని. చలికాలం అయినా పడుకో బోయేటప్పుడు నాకు చెంబెడు మంచినీళ్ళు త్రాగడం అలవాటు. అందుచేత కాంతాన్ని మళ్ళీ కేకవేయక తప్పేదికాదు. "కాంతం కాసిని మంచినీళ్ళు ఇచ్చిపో" అని నేను పిలిచేవాడిన్ని. ఈ కేక విని అక్కడున్న ముసలమ్మ కూడా మా ఆవిడను కోప్పడేది. "ఏమిటమ్మాయ్! వెళ్ళు. మంచినీళ్ళు ఇవ్వకపోతే ఎల్లాగూ? ఎంత దాహంగా ఉందో పాపం బిడ్డకు!" కాంతానికి తెలుసు మంచినీళ్ళు పండుకొనే సమయంలోకాని అడగనని. చదువు కట్టిపెట్టానని తెలుసుకొని అప్పుడు వచ్చేది ఆవిడగారు పై గదిలోకి. అంత కట్టుదిట్టంగా నన్ను బి. ఏ. చదివించి ప్యాసు చేయించింది.

## 3

నేను బి. ఏ ప్యాసు అయి ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించాను. మా ఆవిడతండ్రి ఆ తరువాత కొద్ది రోజులకే హఠాత్తుగా మరణించాడు. తల్లి చిన్నతనంలోనే పోయింది. అందుచేత కాంతం నా దగ్గరే ఉండిపోయింది. ఇక మళ్ళీ పుట్టింటికి వెళ్ళటం అంటూలేదు. నేను ఉద్యోగంలో ప్రవేశించి, మొదటి

నుండీ వేరే కాపరం పెట్టుకొని స్వతంత్రంగా జీవించానేగాని మా తల్లిదండ్రులకు భారంగాలేను.

పగలల్లా స్కూలులో పనిచేయటం కాస్త విసుగ్గానే ఉండేది కాని సాయంత్రం ఇంటికొచ్చి కాంతం ఇచ్చిన కాస్త కాఫీ త్రాగితే హాయి అనిపించేది. ఆ వేళప్పుడు చల్లగాలిలో కాసేపు తిరిగి ఏడుగంటలకల్లా ఇంటికి చేరుకొనేవాడివి.

మా ఇంట్లో భోజనాలెప్పుడూ పెందలాడె అయిపోయేవి. భోజనానంతరం కాసేపు వీధిలో తిరిగినా, తొమ్మిదింటికల్లా గదిలో దీపం పెట్టుకొని కూర్చునేవాడిని కాంపోజిషన్ పుస్తకాలు దిద్దటానికి.

నేను పది పుస్తకాలన్నా దిద్దకముందే గది గుమ్మంలో గాజుల చప్పుడు వినిపించేది. గుండుచెంబుతో నీళ్ళు పట్టుకొని, వెండిపళ్ళెంలో ఫలహారాలు పెట్టుకొని రతీదేవిలాగ తయారై వచ్చేది ఆవిడ. ఆమె రాకకోసం నేను నిరీక్షిస్తున్న మాట నిజమే. అయినా, అనేవాడ్ని "అప్పుడే వచ్చావ్" అని. "అప్పుడే ఏమిటండీ పది కావస్తుంటేనూ" అనేది ఆవిడ. నీవు వస్తే నాపని సాగదు అని నేను నవ్వటం, నేనేం జేశానండోయ్ మీరు వ్రాసుకోండి అని ఆమె అనటం మామూలుగా జరిగే సంభాషణ.

ఆవిడ నా దగ్గరకొచ్చి, నా బల్లకు దగ్గరఉన్న టిపాయ్ మీద నీళ్ళచెంబు, వెండిపళ్ళెంపెట్టి పైన రెండు పుస్తకాలు మూత పెడుతుంది.

ఆవిడ రావడంవల్ల నా చదువుకేం నష్టం! నిజానికి, నాపని నేను చేసుకుపోవచ్చు. ఆ వచ్చినమనిషి చప్పున పడుకొని నిద్రపోతే.

అక్కడ అద్దంముందు నుంచుని ఆవిడ అలంకారం ప్రారంభిస్తుంది. సాదుబొట్టు, స్నో, పౌడరు, పూలచెండూ ఇవన్నీ కనపడాలె. వీటికోసం అన్వేషణ మొదలు. ఏమండీ నా స్నో బాటిల్ చూశారా? అని మొదటి ప్రశ్న. నిజానికి ఆవిడ స్నో బాటిల్ విషయమై నాకు తెలియాలిసిన అవసరం ఏమీలేదు. ఇహ దానికోసం వెతకటంలో నా కాంపోజిషన్ పుస్తకాలన్నీ చిందరవందర అవుతై. అలమారలోని రెండు టీ కప్పులు పగిలిపోవచ్చు. కొంతసేపైన తరువాత అది నేను కూర్చున్న కుర్చీకి సరిగ్గా వెనకాలున్న గూట్లో కనిపించటంచేత ఆవిడ నా బుజాలమీద చెయ్యివేసి అవసరం లేకపోయినా కొద్దిగా నొక్కి, ఆమె వక్షస్థలం నా చెంపకు తాకించి, నానాఅవస్థాపడితే గాని ఆ బాటిల్ బైటపడేదికాదు. ఆస్నో ఆమె కాస్త రుద్దుకొని నాకు కాస్త రుద్దేది.

ఆ తరువాత తలనూనె సీసాకోసం వెతకటంలో ఆవిడ నేను కూర్చున్న కుర్చీమీదే ఎక్కి అలమరలో పైభాగాన్నుంచి తీయాలె. ఆ సమయంలో ఆమె తూలి పడిపోవ బోవటం నేను చటుక్కునలేచి నడుము పట్టుకొని ఆపి, ఆ తరువాత ఆమెను పసిపిల్లను ఎత్తుకొన్నట్లు ఎత్తుకొని దింపటం జరిగేది. దీనికి ప్రతిఫలంగా ఆవిడ కాస్త సుగంధ ద్రవ్యాన్ని నా తలకురాచి చక్కగా పాపటతీసి తల దువ్వేది.

సాదుబొట్టుకోసం, దువ్వెనకోసం, పౌడరు డబ్బాకోసం ఆమె వెతుక్కోటంలో నా చుట్టూ ఎన్నో ప్రదక్షిణాలు అయ్యేవి. ఆ వస్తువులన్నీ నేను కూర్చున్న ప్రదేశానికి అటూ ఇటూ

ఉంటూఉండటం మూలానా, ఆవిడకు ఇల్లాగ చేయక తప్పేది కాదు. ఆవిడ వచ్చేసరికి దిద్దుతూ ఉన్న కాంపోజిషన్ పుస్తకం నావంక జాలిగాచూస్తే, నేననేవాడ్ని "ఇహ నీ సంగతి రేపు–ఇప్పుడు వీల్లేదు" అని. మిగతా పుస్తకాలన్నీ కళ్ళు మూసుకొని బల్లక్రిందపడి నిద్రపోయేవి.

ఆ తరువాత ఆవిడ బ్రోచ్ కనిపించేదికాదు. కనిపించినా అది సరిగ్గా పెట్టుకోటం ఆవిడకు తెలియదు పల్లెటూరి పిల్ల కావటంచేత. కొన్నాళ్ళపాటు అయినా నేనే ఆవిడకు ఫ్యాషన్సును గురించి చెప్పాలిసిన అవసరం కలిగింది. ఆవిడ పమెటసద్ది ఈ అలంకారం విషయమై నేను శ్రద్ధవహించాలిసి వచ్చింది.

ఈ గౌరవంతా చూస్తూ నవ్వుతూఉన్న మల్లెపూలచెండును అప్పుడు మా ఆవిడ ఎత్తుకొని ముద్దాడి, కళ్ళకు అద్దుకొని నా నా చేతుల్లో పెట్టేది. నా చేతులమీదుగా అది ఆమె ముచ్చట ముడిలోకెక్కి అర్ధచంద్రాకృతి తాల్చేది.

ఈ పసిమటుకు అంత తొందరగా అయ్యేదికాదు. అల్లాకాక–దండీ అంటూ ఆవిడ దాన్ని దీసి చాలాసార్లు నాకు ఇస్తూ ఉండడంవల్ల, ఆచెండు నా చేతుల్లోనుంచి ఆవిడ చేతుల్లోకీ; ఆవిడ చేతుల్లోనుంచి నాచేతుల్లోకి మారేది కిలకిలా నవ్వుతున్న పసిపిల్లలాగ. అప్పటికి ఆవిడ అలంకారం ఒక విధంగా పూర్తి అయ్యేది.

అగరు వత్తులు అలమారులో, పై అరలో ఉంటె, అది ఆవిడకు అందదు. అందనప్పుడు నన్ను తీయమనాలె, ఆవిడ అల్లాగ అనదు. అక్కడకు వెళ్ళి ముందు ప్రయత్నం

చేస్తుంది అందుకోటానికి. అప్పుడు నన్ను పిలుస్తుంది "చూడండి కాస్త అవి తీయాలె" అంటూ. రోజూ ఇల్లాగే అంటుంది. అయినా నాకు అవి ఏమిటో ఎక్కడనుంచి తీయాలో తెలిసేదికాదు. అందుకని నేను అడిగేవాడ్ని "ఏమిటి నీకు కావలసింది?" అని. ఆవిడ అటు వేలుచూపేది నవ్వుతూ. "అవా? టీ కప్పులా? వక్కలా?" అని నాకు వచ్చిన పేర్లన్నీ వల్లిస్తూ ఉంటే ఆవిడ ఉహూ; ఉహూ అంటూ నవ్వుతూ ఉండేది. అవి నాకూ అందవు. అందుకని ఎడంచెయ్యి ఆమె బుజంపైన వేసి, ఎగిరి కుడిచేత్తో వాటిని క్రిందకు నెట్టేవాడ్ని. పోనీ వాటిని క్రింది అరలో ఉంచరాదా అంటే "వద్దండీ క్రింది అరలో ఉంచుతారుటండీ ఎక్కడన్నా!" అని నవ్వేది. క్రింది అరలో ఉంచటం వట్టి తెలివితక్కువపని అయినట్లూ నాకు ఆమాత్రం తెలియక పోవటం విచిత్రమైనట్లూనూ!

అగరువత్తులు వెలిగించటం ఒక అరగంటపని. ఎందుకూ అంటే ఆమె అవి వెలిగించడానికై నిప్పుపుల్ల గీస్తే నేను దాన్ని ఉఫ్ అని ఊది ఆర్పేవాడిని. ఆమె మళ్ళీ గీస్తే నేను మళ్ళీ ఆర్పేవాడ్ని. ఇల్లాగ ఎన్నిసార్లు అయినా జరిగేది. చివరకు ఎట్లాగో తంటాలుపడి ఆవిడ అగరువత్తులు వెలిగించేది. సుగంధ భరితమైన ఆ ధూమం గదంతా ఆవరించి నాకు కొంచెం మత్తు కలుగజేసేది.

ఆమె చెయ్యవలసిన పని అంతా అంతటితో పూర్తి కావటం చేత ఆమె నా పక్కనే ఉన్న మంచమైన కూర్చునేది. మర్నాడు క్లాసులో చెప్పవలసిన పాఠం నేను ఒక్కసారి చదవటం అవసరం. హిస్టరీ పుస్తకం తెరిచి చదవటం ప్రారంభించే వాడిని.

మా ఆవిడకు హిస్టరీఅంటే బొత్తిగా ఇష్టంలేదు. అందులో అభిరుచి కలుగజేయాలని, తళ్లికోట యుద్ధాన్ని గురించీ, హెన్రీ–ది–యైత్ ను గురించి ఆమెకు చెప్పాను. చెప్పినా ఆమెకు ఏమీ అభిరుచి కలుగలేదు. అందుకని ఆవిడ "చచ్చిపోయిన వాళ్ళ సంగతులు ఎందుకండీ, తల్లికోటయుద్ధం ఎల్లా తగలెడితేనేం! హెన్రీ-ది-యైత్ కు ఎంతమంది భార్యలైతేనేం!" అని అనడం మామూలు.

నేను పుస్తకంతెరిచి ముందు పెట్టుకొంటే ఏం లాభం ఒక్క విషయమూ బుర్రకు ఎక్కేదికాదు.

ఇంతలో ఆవిడ వక్కపలుకులు నా నోటికి అందించేది. నేను వక్కలతోపాటు ఆమె వేలునుకూడా అందుకొని పంటితో నొక్కితే, ఆవిడ వేలును లాక్కొని "అబ్బ! ఏమిటండీ ఎందుకూ కొరికారు!" అని అడుగుతుంది. నేనంటాను— "అల్లా కొరక్కపోతే—'నోట్లో వేలుపెడితే, కొఱకనేరని అమాయకుడమ్మా మా ఆయన' అని నీవు అందరితో అంటావు అందుకని. ఏదీ చూడనీ నొప్పెట్టిందా?" అని దానితరువాత ఆవిడ లేతతమలపాకులు చిలకలుచుట్టి ఇవ్వటం నేను నమలటం కబుర్లు చెపుతూ. దీనితోనే అయిపోయ్యేది ఒకగంట.

అప్పటికి నిద్రవేళ; మా కాంతం ఆవలించి రెండు చిటికలు వేసి అమ్మ అంటూ నడుమువాల్చేది. ఆ నిద్రవేళ నేనుమటుకు ఏం చదవగల్గును! ఆ పుస్తకాన్ని మూసి బల్లమీద పెట్టి, పడుకోటానికి సిద్ధపడేవాడిని.

అదీగాక మత్తెక్కించే పరిమళాలు, ఉపభోగ సూచకమైన ఆ తెల్లని శయ్యా నన్ను ఆహ్వానిస్తుంటే ఏమంటానికి తోచేది

కాదు. మా ఆవిడ వలకపోసిన నవ్వులన్నీ ఆకృతి దాల్చినట్లు మల్లెపూలన్నీ ఆ పక్కపైనపడి, దొర్లుతూ నన్ను ఆహ్వానించేవి. ఆ ఫలంగా నేను దీపం తగ్గించటం గ్రహించి ఆవిడ నవ్వుతూ, పక్కకు ఒత్తిగిలి, ఆమె దిండుపైన నా తల పెట్టుకొంటానికి కొంత చోటు ఇచ్చేది.

# 4

మా ఆవిడకు ఇంగ్లీషురాదు. రాకపోయినా కొన్ని ఇంగ్లీషు మాటలు మధ్య మధ్య ఉపయోగిస్తూ ఉండటం మూలాన, ఈవిడకు ఇంగ్లీషు వచ్చునేమో నని ఇతరులు అనుకోవచ్చు. "మీరు మాట్లాడుతూ ఉంటే నా కేదో అర్థం అయినట్టే ఉంటుందండీ" అని కూడా అంటూ ఉంటుంది ఆవిడ.

కాబట్టి మంచి ఊహా, తెలివితేటలూ ఉన్నాయని తోచి, దీనికితోడు కొంత చదువు చెబితే ఇట్టే అల్లుకు పోతుం దను కొన్నాను. మా ఆవిడ ఇంగ్లీషు మాట్లాడుతూ ఉంటే వినాలనీ సరదా పుట్టింది. అదో కష్టమైన పనికాదు. నా చేతులోపని ! ఊళ్ళో వాళ్ళ అందరికి, చెపుతున్నా కదా నా స్వంత భార్యకే చెప్పుకోలేనా !

ఇంగ్లీషు పుస్తకం ఒకటి కొనుక్కొచ్చాను. అక్షరాలు గుర్తుపట్టటం నాలుగైదు రోజుల్లో వచ్చింది. చాలా సంతోషించాను. నేను అనుకొన్నట్లు తెలివితేటలు ఉన్నవి. చెబితే వస్తుంది. రోజూ ఓ గంటా రెండు గంటలు శ్రమపడి చెప్పి

నాలుగు నెలల్లో ఏడ్స్ రీడరు పూర్తిచేయించ గలుగుదును. ఒకటి రెండు సంవత్సరాలకల్లా ఇంగ్లీషు పేపరు తాను స్వయంగా చదువుకొనే శక్తి వస్తుంది.

ఆ తరువాత భార్యాభర్తల జీవితం అదో తమాషాగా ఉంటుంది. నేను ఇంటికి రావటంతోనే ఆవిడ ఇంగ్లీషుతోనే స్వాగతం ఇస్తుంది. నేను క్లబ్బుకు వెళ్ళాలసిన అవసరమూ ఉండదు. బైట వరండాలో పడకకుర్చీలో జేర్లబడి కూర్చుంటే మా ఆవిడ నాకు ఎదురుగా కుర్చీలో కూర్చుని అంచక్కాగా పేపరు మొదటినుండి చివరదాకా చదివి వినిపిస్తుంది. మొదట్లో ఉచ్చారణలో కాస్త తప్పులు వస్తే నేను చెబుతూ ఉంటాను.

అయితే పేపరు చదివించటమే నా ఏకైక ఆశయంగా పెట్టుకోలేదు. వీలైతే బెనారెస్ విశ్వవిద్యాలయ మెట్రిక్యులేషన్ పరీక్షకు కట్టించి ప్యాసుచేయిద్దా మనుకొన్నాను. "పరీక్షలు ప్యాసై ఉద్యోగాలు చేస్తుందా ఎందుకయ్యా నీకీ పిచ్చి" అని అయినవాళ్ళు అందరూ అంటే అంటారు. ఆ మాటలు లెక్క జేయకుండా చదివించటమే మంచి దనుకొన్నాను.

ఆ పరీక్ష గనక ప్యాసు అయిందా ఆ తరువాత ఎల్లాగో కష్టపడి బి. ఎ. దాకా చెప్పించాలనే ఊహ.

అప్పటికి మా ఆవిడకు పదహారేండ్లు. ఇంకా పిల్లాజెల్లా కలగలేదు. అందుకని నేను ఊహించినదంతా అసంభవము ఏమాత్రముకాదు. భగవంతుడి దయ ఉండాలగాని, అనుకొన్న దంతా అక్షరాలా జరగటానికి అవకాశాలున్నాయి.

మా ఆవిడకు చదువు ప్రారంభించి ఒక్కనెల అయినా కాలేదు. అప్పుడే ఆవిత చిన్న చిన్న వాక్యాలు చదవటం, వ్రాయటం, సాధనచేసింది. ఇంగ్లీషు ముక్కలు ఆడవాళ్ళే అనాలి. మొగవాళ్ళ నోట్లోబడి అవి మొద్దుబారి పోతవి. అందం అంతా నశిస్తుంది. మా ఆవిడ, క్యాట్—శాట్ అపాన్—ద మ్యాట్ అని అంటూఉంటే, వీణలమీటుల్లాగ ఉందిగాని మరోవిధంగా లేదు.

నన్ను లోపలికి రండి అనాలిసి వచ్చినా బైటికి వెళ్ళండి అని అనాలిసి వచ్చినా ఆమె ఇంగ్లీషుతోనే అంటూఉంటే విని ఎంతో సంతోషించాను.

ఆవిడకు చాలా ఉత్సాహంగా ఉండేది. ఒకపాఠం చెప్పి ఇది సాయంత్రానికల్లా కంఠస్థం చేయమని చెప్పి నేను వెళ్ళేవాడ్ని. స్కూలుపని కావడంతోనే పరుగెత్తుకుంటూ వచ్చేవాడ్ని పాఠం అప్పజెప్పుతుందామని. స్నానంజేసి మంచి తెల్లచీర కట్టుకొని పూలుపెట్టుకొని కుర్చీలో కూర్చుని చదువుకొంటూ ఉంటుంది నేను చెప్పివచ్చిన పాఠం అని అనుకొంటూ ఇంటికొస్తే మా ఆవిడ వంట ఇంట్లోనుంచి కేకపెట్టేది. ''వస్తున్నా వస్తున్నా'' అంటూ, వంట ఇంట్లోకి పోయి చూద్దును కదా ఆ ఇంగ్లీషు పుస్తకం చారు రాచ్చిప్ప మీద ఉండేది. ఇలాంటి దృశ్యాలు నన్ను చాలా నిరుత్సాహ పరచినవి.

అయినా నేను చదువు చెప్పడం సాగించాను. ఎందుకో ఆవిడకు మొదట్లో ఉన్న ఉత్సాహంగావి పట్టుదలగాని తరువాత తరువాత లేకపోయినై. పాఠం చెబుతూ ఉత్సాహంగా ఉన్న

సమయంలో, మా ఆవిడ "ఉండండి ఉండండి ఒక్కక్షణం" అని గబుక్కునలేచి వంట ఇంట్లోకి పరుగెత్తి "ఛా ఛా వెధవ పిల్లి సొంట్లు సోధిస్తుంది. పారపోయ్యనే పారపోసింది" అనుకొంటూ, అది ఇది సవరిస్తూ, అక్కడే ఓ అరగంట ఉండటం, ఈ లోవల నేను నిద్రపోవటం జరుగుతూ ఉండేది.

పగలు నాకు తీరిక ఉండేది కాదు. రాత్రి నిద్రవేళా. చదువు సాగేదికాదు. ఒకరోజున పట్టుబట్టి కూర్చోబెట్టాను. ఏమైనా కానీ ఓముక్క చెబుదామని. ఆవిడ కళ్ళుమూస్తూ తెరుస్తూ, చిటికవేస్తూ, వింటూన్నది. ఇంతలో ఆవిడ, ఏదో ముఖ్యమైన విషయం జ్ఞాపకానికి వచ్చినట్లు ఉలిక్కిపడి, "అయితే చూడండి—ఈ చదువుకేం కానీండి, రేపు కార్తీక మాసానికి యుద్ధం ఆపేసి నవరసులు చౌక చేస్తారటగా" అన్నది.

ఆ మాట పొందిక బహుబాగుంది. యుద్ధం ఆపేసి నవరసులు చౌక చేస్తారుట! అంటే నవరసులు ప్రియం జేసి, ఆడవాళ్ళను ఏడిపించేందుకే అసలు ఈ యుద్ధం చేస్తూఉన్నట్టూ, కానేపు ఏడిపించి పాపం, 'ఇకచాలు వీళ్ళను ఏడిపించటం' అని స్త్రీలకై జాలితలచి, ఈ యుద్ధం ఆపేయటానికి ఎవరో నిశ్చయించినట్టూనూ!

ఆ ఒక్కసారే కాదు. నేను ఎప్పుడు చదువు మొదలుపెట్టినా ఆవిడ నవరసుల గొడవే ఎత్తేది. నవరసులు చౌకచేయడాన్ని గురించి ఆవిడ బోలెడు వదంతులను వినేది.

ఈమధ్య ఒకసారి మిత్రమండలి వారికి ఎక్కడో అఖండ విజయం కలిగిందని పేపరులో పడ్డది. ఆరోజు సాయంత్రమే

మా ఆవిడ అన్నది. "ఏమండీ మీరు వెళ్ళారా'' అని. ''ఎక్కడికి'' అన్నాను. ''అయ్యో నా బొందా! మీరు వెళ్ళనేలేదూ? మీ రెందుకు వెళ్ళుతారూ! మనకు ఆ నేర్పూ, ఆ పొందిక ఉంటే, ఇంకా అనుకోవలసిం దేముందీ! ఇవ్వాల మధ్యాహ్నం ఫిరంగి వేసిన తరువాత ఒక గంటసేపు నవరసులు చౌకగా అమ్మేశారట!'' అన్నది.

నేను నవ్వి ''ఛా వట్టిదేనే తెలివితక్కువదానా! నవరసులు ఎందుకు అమ్ముతారూ చౌకగా?'' అన్నాను. ఆపళంగా మా ఆవిడముఖం చేటంత చేసుకొని "అయ్యో నన్ను తగలెయ్య!! మీ రింతకూ వినలేదా! మనవాళ్ళకు యుద్ధంలో జయం కలిగిందట. అందుకని ఒక్క గంటసేపు నవరసులు చౌక చేయమని కలెక్టరు ఆర్డరు ఇచ్చాడుటండీ!'' అని బారలు తీస్తూ చెప్పింది. మొత్తం మీద మా ఆవిడకు నవరసుల మీద ఉన్న దృష్టి చదువుమీద లేదు. ఒకవిధంగా నవరసులు చౌక అయినదాకా చదువు ఆపేద్దామన్నట్లు సూచించింది.

నేను ఒప్పుకోక, అల్లాగే పట్టుబట్టి చదువు సాగించాను. కాని నాకు ఒకటి తోచింది. నా దగ్గర ఆవిడకు చదువు సాగేటట్లు లేదు. చదువుకని కూర్చోటం ఏవో కబుర్లు చెప్పటం!! ఆ కబుర్లకు అంతూ పొంతూ లేదు. ఏదో చెప్పేది నవ్వేది. ఒకటే నవ్వు.

పోనీ పగటి పూట నేను స్కూలుసకు వెళ్ళిపోయిన తరువాత ఆవిడ కేం పనుంది! చదవకూడదూ? ఊహూ. నిద్ర అంటుంది. ఏవరో వస్తే మాట్లాడుతూ కూర్చున్నాను అంటుంది.

ఏదో అంటుంది. మొత్తంమీద ఆవిడకు ఏమీ తీరిక లేనట్లే తేలుస్తుంది.

అందుకని ఇహ ఇట్లాకాదు. ఈవిడను స్కూలుకు పంపితే మంచిది అనుకొన్నాను. తొమ్మిదింటికల్లా వంట జేస్తుంది. అంతగా అయితే నేనుకూడా సాయం జేస్తాను. ఇద్దరంకూడా తొమ్మిది, తొమ్మిదిన్నరకు భోజనం చేస్తాము. ఆవిడను అల్లా ఆడస్కూలుకు పంపి, నేను ఇట్లాగ మా స్కూలుకు వెళ్ళ వచ్చు ఏమీ ఇబ్బంది ఉండదు. అల్లాగే చేద్దామని నిశ్చయించు కొన్నాను.

స్కూలులో చేరి ప్రతిదినమూ బడికి వెళ్ళటం అలవాటైన తరువాత, చదువుయందు ఆమెకు తప్పకుండా అభిలాష ఎక్కువ అవుతుంది. చదువుకొనే ఇతర ఆడవాళ్ళను చూస్తుంది. బాగా చదువుకొని పెద్ద పరీక్షలు ప్యాసై వాళ్ళవలె విద్యావంతురాలు కావాలని నిశ్చయం ఆమెకు తప్పక కలుగుతుంది,

అని ఇల్లాగ నిశ్చయించుకొని. ఈ సంగతంతా ఆవిడతో చెప్పాను, స్కూలులో చేరవలసిందని ఎంతో ప్రోత్సాహం చేశాను. విద్యావంతురాలైన స్త్రీకి సంఘములో కలిగే గౌరవం, మర్యాద ఎల్లాగ ఉంటుందో, విద్యలేని స్థితి ఎంత నీచమో ఆమెకు తెలిసేటట్టు, నా నేర్పు ఉపయోగించి చెప్పాను,

నేను చెప్పినదంతా విని ఆవిడ విరసనంగా నవ్వి అయితే, ఎప్పటినుంచి వెళ్ళమంటారూ బళ్ళోకి నన్ను ? అని అడిగింది,

రేపు జూలైనుంచి వెళ్ళ — అన్నాను. అది విని జనవరి నెల ఆవిడ ఏదో ఆలోచించి, "అంటే—చైత్రం, వైశాఖం, జ్యేష్ఠం,

ఆషాఢం'' అంటూ వేళ్ళ కణుపులు లెక్కబెట్టి, 'ఉహూ' అని తల విసురుగా ఊపింది వీలు లేదన్నట్లు.

''ఏం ఎందుకు వీల్లేదూ?''

ఆవిడ విరగపడి నవ్వుతూ, వీల్లేదండీ—బొత్తిగా వీల్లేదు. అని, నవ్వితే దేహం కదలటంవల్ల సళ్ళొదిలిన నీవీ బంధాన్ని నవరించుకొంటూ గదిలోకి వెళ్ళిపోయింది,

ఆ సంవత్సరం జూలై నెలలో ఒకరోజున మా ప్రథమ సంతానం రుక్కుతల్లి పుట్టింది. పురుటి గదిలోనుంచి మామరదలు బైటికొచ్చి ''కూతురు! కూతురు కలిగింది బావా నీకూ!'' అని చెప్పి ''అంతా నీ రూపే బావా! ముక్కు నీ ముక్కు? నోరు నీ నోరు! కళ్ళు నీ కళ్ళు!'' అని వర్ణించింది.

రుక్కుతల్లి పుట్టిన మరుసటి జూలైలో నాకు టైఫాయిడ్ జ్వరం రావటంవల్ల, ఆవిడ స్కూలులో చేరాలనే ఆలోచనే రాలేదు.

ఆ తరువాత కాంతానికి రెండేండ్ల కొకసారి కాన్పు వచ్చి, సుశీ, శాస్త్రి, రాధ, విజయులు వరుసగా పుట్టారు. బిడ్డల తల్లి అయిన తరువాత, కాంతానికి పిల్లలతోనే సరిపోయింది. ఆవిడ చదువుసంగతి అనుకొన్న వాళ్ళు ఎవరూలేరు.

ఈవిధంగా మా ఆవిడ ఇంగ్లీషు చదువు ది-క్యాట్‌శాట్-అపాన్-ద మాట్ తో పూర్తి అయింది. కాని మా కాంతం తెలుగులో కాస్త చదువు కొన్నది. ఆవిడ చిన్నప్పుడు పదేండ్ల దాకా ఏదో స్కూలులో చదివింది. ఆ తరువాత ఇంట్లోనే ఉండి, వాళ్ళ అమ్మదగ్గర, నాన్నదగ్గర కొన్ని విషయాలు నేర్చుకొంది.

లంకాయాగం, కుచ్చెలకథ మొదలైనవి ఆమె చెప్పుకొన్నది. కుచ్చెల కథలో కొన్ని ఘట్టాలు ఆమె చదువుతూ ఉంటే దుఃఖం ఆపుకోటం కష్టం అయ్యేది. గోవుపాట కూడా అల్లాగే పాడేది ఆవిడ.

మా ఆవిడ కుమారీశతకం, నృసింహాశతకం చదివింది. కృష్ణ కర్ణామృతంలోని కొన్ని శ్లోకాలు కంఠతావచ్చు. అధ్యాత్మ రామాయణ కీర్తనలు పాడేది. భాగవతంలో నుంచి ప్రహ్లాదచరిత్ర, కుచేలోపాఖ్యానం ఆవిడ చక్కగా అర్థం తెలిసి చదవగలిగి ఉండేది.

ఆవిడకు శ్రీరాముడు అయోధ్యలో ఉండేవాడని తెలుసుగాని ఇప్పటి వైస్‌రాయ్ ఎక్కడ ఉంటాడో తెలియదు. రామచంద్ర మూర్తి దండకారణ్యానికి ఏ మార్గాన పోయినాడో ఏయే ఆశ్రమాలలో ఆగినాడో తెలుసుగాని, ఇక్కడనుంచి మద్రాసుకు ఎట్లా పోవాలో. ఏ బండి ఎక్కాలో ఎక్కడెక్కడ మారాలో తెలియదు. పంచాంగం చూచి తిథి వార నక్షత్రాలు చెప్పగలదు. కాని రైల్వేగైడ్ చూడలేదు.

## 5

కాంతం ఏమాట అయినా వెటకారంగా అన్నా విరుపుగా అన్నా తమాషాగానే ఉండేది. కోపం వచ్చేసమయంలో చటుక్కున నవ్వుమాట అనేసేది. దానితో ఇద్దరం నవ్వుకొనేవాళ్ళం. ఆ వచ్చిన కోపం అంతా దాని దారిన అదే పొయ్యేది.

అమ్మాయిని చూచి వస్తాను, నాలుగు రోజుల ప్రయాణానికి కావలసిన బట్టలు కాస్త సంచిలోపెట్టి ఇయ్యమని అడిగాను ఒకసారి మా కాంతాన్ని. రెండు మూడు చొక్కాలు, ధోవతులు వేసి ఇస్తుందికదా అని అనుకొన్నాను. తీరా ప్రయాణం అయి బండిలో ఎక్కి చూచుకొంటే అందులో ఒక్కచొక్కా, ఒక్క ధోవతీ ఒక్క తువాలూ ఉన్నయి.

"ఇదేమిటే కాంతం. ఎల్లాగ సరిపోతవి ఇవి"—అని అడిగాను.

"సరిపోకేం? బాగానే సరిపోతై" అన్నది కాంతం.

"చాలవు ఊరికే వాదిస్తూ కూర్చోక ఇంకా రెండు ధోవతులూ, మరిరెండు చొక్కాలూ ఇయ్యి" అన్నాను కోపంగా.

ఎందుకండీ, ఎక్కడన్నా పారేసుకొస్తారు అన్నది ఆవిడ నవ్వుతూ. నాకు ఒళ్ళు మండిపోయింది. "పారేసుకు రావటం ఏమిటి? ప్రయాణం చేసినప్పుడల్లా బట్టలు పారేసుకొస్తున్నానా? అన్నాను విసుగ్గా.

"అంతకోపం ఎందుకండీ? పారేస్తే పారేయావచ్చు. అందుకని అన్నాను" అంది.

ఇల్లాగ ఆవిడమాట దేనికీ అందకుండా అంటుంది. పారేస్తే పారేయవచ్చుట. అల్లాగ అయితే ఎన్నో జరగవచ్చు. నాకు ప్రయాణం చేస్తున్నపుడు రైల్లో వందరూపాయల నోట్లు ఉన్న ఒక పర్సు దొరకవచ్చు. లేకపోతే కృష్ణవంతెన మీద రైలు విరిగిపడవచ్చు. మా రైలు ఇంకో రైలుతో కొట్టుకోవచ్చు. ఈ వచ్చు వచ్చులు భవిష్యదర్థంబుల వ్యర్థపదంబులు—అని గదా సూత్రం—తెలియకా? తెలిసే మాట్లాడుతుంది ఆమె.

ప్రయాణానికని బయలుదేరినపుడు చేతులో సరిగ్గా కావలసిన దానికంటే నాలుగు రూపాయలు ఎక్కువగా ఉండాలని నా ఉద్దేశం. పొరుగూరులో ఏసమయానికి ఏమికర్చు వస్తుందో! అక్కడ మనకు ఎవరిస్తారూ కావలసివస్తే! అందుకని నాలుగు రూపాయలు ఎక్కువగానే జేబులో వేసుకొని బయలుదేరుతూ ఉంటాను.

మా ఆవిడకు ఇది బొత్తిగా సరిపడదు. జేబులు వెతికి ఎక్కువగా ఉబ్బి ఉన్నదని తోస్తే తీసివేసేది. "ఎందుకే కాంతం, అల్లాగ తీసేస్తావు? అంటే—"మీకు కావలసిన దానికంటే ఎక్కువ ఎందుకు చెప్పండి? ఏదో అనవసరంగా కర్చుచేస్తారని" అనేది. అల్లాటప్పుడు నాకు మరీ చెడ్డకోపం వచ్చేది. "ఎందుకు కర్చుచేస్తానూ! అంతమాత్రం జాగ్రత్త నాకు మటుకులేదా? నీవే మహాజాగ్రత్త మనిషివికామాలు! అసలు నేను వట్టి తెలివితక్కువవాడిని అని నీ అనుమానం" అనేవాడ్ని విసురుగా. "ఆహాఁ హాఁ హాఁ—అనుమానం ఏం లేదండీ. నాకు గట్టి నమ్మకమే" అంటూ ఆవిడ నా వీపుపైన మృదువుగా తట్టి ముఖంలో ముఖంపెట్టి నవ్వేది. కోపం మెల్లగా జారిపోయేది.

మరోసారి సరసానికి వాళ్ళ వాళ్ళను వెక్కిరిస్తూ "కాంతం మీ చెల్లెలు ఓకోతి. మీ అక్కయ్య మరోకోతి' తోకలుమటుకు లేవు అదొకటే లోపం"—అన్నాను. మీ చెల్లెళ్ళకు ఆ ఒక్క లోపంకూడా లేదులెండి అన్నది ఆవిడ విరగబడి నవ్వుతూ. అంటే తోకల్లేకుండానే కోతులట వీళ్ళ వాళ్ళు. ఇల్లాగ దెబ్బ తగలకుండా హాస్యం ఆడటంలో కాంతా నిది పెట్టింది పేరు.

మా ఆవిడ కాపరానికి వచ్చిన తరువాత చాలారోజులు ఏ విధమైన పొరుపూ లేకుండానే గడిచిపోయినాయి. ఒకటి రెండు సార్లు మా ఆవిడకు నామీద కోపం వచ్చింది. కాని పెద్ద పోట్లాటలు ఏమీ జరగలేదు. ప్రణయ కలహాలు కూడా లేకుండానే కాలం గడిచిపోయింది.

ప్రణయ కలహాలు ప్రేమను ఉద్రిక్తం చేస్తాయనీ, తద్వారా వచ్చే ఎడబాటు క్షణికమైనా, సహింపరానిదై పరస్పరానురాగాన్ని వృద్ధిచేస్తుందనీ అంటారు.

భార్యాభర్తలు సరసోక్తు లాడుకొంటున్నపుడు ఏదోమాట మీద ఆవిడకు కోపంరావటం. ఆయన బ్రతిమలాడి ఆమెను ప్రసన్నురాలను చేసుకోటం సామాన్యంగా జరిగే విషయాలే.

క్రొత్తరోజుల్లో ఆమె మనస్సుకు కష్టం కలిగించేమాట నేను ఎప్పుడూ అనేవాణ్ణి కాదు. ఏ మాటమీదనైనా ఆవిడకు రవ్వంత కష్టం కలిగిందా. నేను ఎంతో నొచ్చుకొనేవాడిని. ఆవిడ కాస్త దూరంగా నుంచుంటే మరీ ఆకర్షణీయంగా ఉండేది. ఆవిడలో ఏదో క్రొత్త తేజస్సు కనపడేది. ఆవిడ పెదవులు, కళ్ళు, చేతులు, పాదాలు అన్నీ కూడా క్రొత్త అందాన్ని తెచ్చుకొన్నట్లు తోచేది. ఆవిడ పలుకుల్లో సరిగమల్లో ఇమడిన మాధుర్యం కనపడేది. అందుకని ఒక్క క్షణంలో మళ్ళీ ఆమెను సంతోషపెట్టి నవ్వించి ఆనందించేవాడిని.

అయితే అవి ప్రణయ కలహాలు మట్టుకు కావు. ప్రణయ కలహం అనేది ఒక కామక్రీడ. అది శాస్త్రరీత్యా జరపటానికి

ఒక చిన్న సత్యనారాయణ వ్రతానికి జరపవలసి నంత తంతు ఉన్నది.

శాస్త్రరీత్యా ప్రణయ కలహాన్ని పట్టిన మనిషి విరహ తాపాన్ని పొందాలె. మా ఆవిడ పూర్వకాలం మనిషి కావటం చేత ఆవిడ కెప్పుడలా విరహతాపం కలుగలేదు నేను కలిగించా లని ప్రయత్నమూ చేయలేదు.

సత్య ప్రణయ కలహంపట్టి ఏమి చేసిందో నాకు తెలియక పోలేదు. ముందు భరింపరాని విరహబాధ పడ్డది. అంతబాధ మా ఆవిడకు కలుగుతుందని నాకు ఏ మాత్రం నమ్మకంలేదు. దాని తరువాత చెలికత్తెలు ఆమెకు చందన గంధం పూసి, విసన కర్రలతో విసరాలె, ఇదంతా మా ఇంట్లో సాగదు. మాది సామాన్య సంసారం. చెలికత్తెలు లేరు. ఒక్కపనిచేసే మనిషి తప్ప. అదైనా ప్రొద్దున్నే వచ్చి ఒక గంటఉండీ పోతుంది కాబట్టి ప్రణయ కలహం మా ఇంట్లో జరగటానికి అట్టే అవ కాశం లేకపోయింది. నేనైనా పట్టుబట్టి ఆవిడచేత ప్రణయ కలహం పట్టించనూ లేదు.

ప్రణయ కలహం పట్టిన మనిషి మెడలో ఉన్న ముత్యాల హారాలు తెంపి పోయాలె. మీ ఆవిడ మెళ్ళో ముత్యాలహారా లున్నయా? ఆ తరువాత ఆమె కోప గృహంలో పడుకోవాలె గదా! మీ ఇంట్లో కోపగృహం ఏదీ! ఇవన్నీ మీ ఇంట్లో లేవు. కాబట్టి నిజమైన ప్రణయ కలహం జరగటానికి అసలు వీలే లేదు. అంటారేమో! అల్లాఅంటే నేను ఒప్పుకోను.

మెడలో ముత్యాలహారాలు లేనిమాట నిజమే కాని ఆ ఉన్న ఒక్క గొలుసూ తెంపుకోవచ్చు. కోపగృహం లేకపోతే వంట

ఇంట్లోనే పమిటిచెంగు పరచుకొని పడుకోవచ్చు. చెలికత్తెలు లేకపోతే పనిచేసే మనిషితో సరిపెట్టుకోవచ్చు కాబట్టి ప్రణయ కలహాలు పట్టడానికి వీల్లేక పోలేదు.

కాని నేనే అటువంటివి మనకొద్దు అని ఊరుకొన్నాను. మా ఆవిడ ప్రణయ కలహం పట్టిందే అనుకోండి. పట్టినా మీద కోపం తెప్పించుకొని తలుపు బిడాయించుకొని పడుకుంటుంది. అప్పుడు నా గతి ఏం కావాలె! తెల్లవార్లూ బైట అరుగుమీద చలిలో వణుకుతూ పడుకోవలసిందే కదా!

అదీగాక తీరా ఆవిడ ప్రణయ కలహంపట్టి సక్రమంగా నడిపి, మాసిన చీరగట్టుకొని మౌనముదాల్చి నిరస్త విభూషయై పడుకొన్న తరువాతా, పిల్లలకు అన్నం ఎవరు పెడతారు! అప్పికి అంట్లు ఎవరేస్తారు! ఇల్లూ వాకిలీ ఎవరు ఊడుస్తారు?

ఇల్లాంటిది ఎప్పుడో ఒక్కసారి జరిగితే, ఎల్లాగో సరిపెట్టుకు పోవచ్చు. మనవాళ్ళకు ఇల్లాంటిది ఒకసారి నేర్పామా అంటే, వాళ్ళు దాన్ని వదలరు. ఇంటికి ఆలస్యంగా వచ్చినపు డల్లా చటుక్కున ప్రణయ కలహం పట్టేస్తారు! అదే అలవాటై రెండురోజుల కొకసారి కోపగృహంలో ప్రవేశించి, ఆ ఉన్న ఒక్క గొలుసూ, పుటిక్కి పుటిక్కీన తెంపుతూ ఉంటే ఎల్లాగ?

ఈ కారణాలచేత నేను మా ఆవిడచేత ప్రణయకలహం మటుకు పట్టించలేదు. ఆవిడ పట్టనూలేదు.

## 6

ఆ తరువాత రెండేండ్లు గడచినై. మా కాంతం ప్రణయ కలహాలు కాక, సిసలైన జాతీయ కలహాలు నేర్చుకొంది. మొదటి రోజులలో అవికూడా సరదాగానే ఉండేవి.

మనము సముద్రస్నానానికి వెళ్ళి ఒడ్డున నడుంలోతున నుంచుని ఉన్నప్పుడు, అలలు ఎదురొచ్చి నవ్వుతూ మనలను వెనక్కి తోస్తయి. ఆ మాత్రంచేత ప్రమాదం ఏమీలేదు. మనలను గట్టిగా పట్టుకొని, భూమిమీదనుండి లేవనెత్తి ఉక్కిరిబిక్కిరిచేసి, పొర్లించి, కోపంతో సముద్ర మధ్యంలోకి ఈడ్చుకు పోయే భయంకరమయిన తరంగాలు కావు అవి. అల్లాగే మావి పోట్లాటలే అయినా అవికూడా ఓ విధంగా ప్రణయ లీలలకిందే లెక్క.

మా పక్కఇంట్లో సుందరమ్మగారు కాపురం ఉన్నారు. ఆవిడ మా ఇంటికి అప్పుడప్పుడు వచ్చి కాసేపు కూర్చుని మా ఆవిడతో మాట్లాడి పోవటం కద్దు.

ఒక శనివారం అది. నేను ఆ రోజు మధ్యాహ్నం కాస్త నిద్రపోతున్నాను. నేను నిద్రలో ఉండగానే మధురమైన కంఠస్వరం ఒకటి వినిపించింది. ఎవరా అని ఆశ్చర్యంతో నేను లేచి కిటికీలోనుంచి చూశాను. సుందరమ్మ ఒక్కతే అక్కడ కూర్చుని కూనిరాగాలు తీస్తున్నది. ఇదివరకు ఆమెను నేను చాలాసార్లు చూశానుగాని ఎప్పుడూ ఆవిడ అంత అందంగా కనుపించలేదు. మంత్రముగ్ధుడ్ని అయి అల్లాగ చూస్తూ నిలబడి పోయినాను, ఎటునుంచి వచ్చిందో మా ఆవిడవచ్చి నా వెనకాల నిలబడిఉంది నేను ఇటుతిరిగి చూచేసరికి. నేను చేస్తున్న దొంగ పనికి సిగ్గుపడి తలవంచుకొన్నాను. ఆమె కొరకొరలాడి వెళ్ళి పోయింది.

కాని ఆవిడ కోపం అంతటితో పోలేదు. రోజు రోజల్లా ఆమె ధుమ ధుమ లాడుతునే ఉంది. ఆరాత్రి అన్నం తినే

టప్పుడు నేను కావలసింది అడగటం, ఆమె మరొ్కాదకుండా వడ్డించటం జరిగింది.

భోజనం అయిపోయి నేను మేడపై గదిలోకి వెళ్ళి కూర్చు న్నాను. కాంపోజిషన్ పుస్తకాలు ముందు వేసికొని ఆమెరాకకై నిరీక్షిస్తూ, మామూలుగానే వచ్చిందికాని నా పక్కన కూర్చో లేదు. నాకు తమలపాకుల చిలకలుచుట్టి ఇవ్వనూలేదు. తమల పాకుల పళ్ళెం బల్లమీద పెట్టి ఊరుకొంది పక్కమీదనున్న మాసిన దుప్పటి తీసివేసి కొత్తదుప్పటి వెయ్యలేదు. మంచి నీళ్ళ చెంబుమాత్రం మంచం క్రింద పెట్టింది. కిటికీలోనుంచి గాలి కోపంగా వీయసాగింది. నేను దిద్దుతూఉన్న కాంపోజిషన్ పుస్తకాలవంక ఆవిడ చూడనైనా చూడక పోవటంవల్ల అవి గిలగిల కొట్టుకొన్నయి పాలకోసం ఏడ్చే పసిపిల్లలాగ, నా గదికిబైట ఉన్న వసారాలో ఒక చిన్న పట్టెమంచంమీద వేరే పక్కకూడా వేసి ఉంది.

సంగతి గ్రహించటానికి ఆటేసేపు ఆలోచించ వలసిన అగత్యం లేకపోయింది. నా పక్కమీద నేను పడుకొన్నాను. అప్పటివరకు విసురుగా వీస్తున్న గాలి చటుక్కున ఆగిపోయింది. కొంసేపు ఉక్కపోసి. నల్లులు కుట్టి, నిద్రపట్టిందికాదు.

మర్నాడు ప్రొద్దున నేనులేచి చూసేసరికి బాగా మబ్బుపట్టి ఉంది. కొద్దిగా చినుకులు కూడా పడటం సాగినై. ఏమంత ఉషారుగా లేదు. రోజల్లా ఇంట్లోనే ఉండి పోయినాను ఏదో చదువుకొంటూ. సాయంత్రంమటుకు కొస్త బయటికి వెళ్ళి అటూ ఇటూ తిరిగి పెందలాడే ఇంటికి వచ్చేశాను.

మా ఆవిడ ఇంకా ముసుముసుకొనే ఉంది. ఆవిడకు అంత కోపం రావటం మటుకు నాకేమాత్రం బాగుండలేదు. పరస్త్రీని కన్నెత్తి చూడటమే అంత తప్పపనా? ఆవిడను నేను పలుకరించానా, మాట్లాడానా? ఏమీలేదే? ఎందుకో అంతకోపం నాకు అర్థంకాలేదు! నిజానికి ఇంకొకరివంక చూస్తే, మా ఆవిడగారికి ఇంతకోపం వస్తుందని నాకు తెలియదు.

ఇంత ముసుముసుకోకపోవే, ఈఆవిడ మటుకు, నా దగ్గర కొచ్చి ''ఎందుకండీ అలాగ దొంగతనంగా ఆవిడవంక చూస్తారు? తప్పు; అల్లాగ చూడకూడదు'' అని చెపితే నేను వినక పోయి నానా! ఈ కాస్తదానికి ఇంత గడబిడ చేయటం బొత్తిగా దౌర్జన్యం అనిపించింది.

నేను యింటికి రావటంతోనే గబగబా వంటఇంట్లోకే పోయి కాంతాన్ని చూచి పలకరించి రావటం మామూలు. ఆ రోజున నేను వెళ్ళలేదు. మాట్లాడకుండా, స్నానంచేసి గదిలో పుస్తకం తెరచి ముందుపెట్టుకు కూర్చున్నాను. ఆ తరువాత కాసేపటికి ఆవిడవచ్చి "వంట అయింది భోజనానికి లేవవచ్చు'' అన్నది. నేను అన్నాను 'అక్కర్లా' అని.

ఏం?

నాకు ఆకలిగా లేదు.

ఎందుచేతా?

.... .... .... .... ....

ఎందుచేత అండీ అక్కర్లేకపోవటం? కాఫీహోటల్లో తిన్నారా?

ఉహు.

అయితే లేవండి కొద్దిగా తినవచ్చు.

"నాకు తినాలని లేదు.''

''అయితే నాకూ తినాలని లేదు.''

ఇల్లా అని ఆవిడ వంట ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఆరోజల్లా మేమిద్దరం ఒక్కమాట అయినా మాట్లాడుకోలేదు. తప్పుకు తప్పుకు తిరిగాము. ఈస్థితి నాకెంత కష్టంగా ఉందో ఆవిడకూ అంత కష్టంగా ఉండీ ఉంటుంది. ఆవిడే దారికొస్తుంది. నేనూ తొందర పడకూడదు. మగవాడిని అయినందుకు కాస్త బెట్టుగానే ఉండాలె అని నిశ్చయించుకొన్నాను.

అయితే ఒక చిన్న చిక్కొచ్చింది. ఆవిడ ''నేను కూడా తినను మీరు తినకపోతే'' అని వెళ్ళిపోయింది. నామూలాన ఆవిడను పాపం పస్తు పనుకోనియ్యడం అధర్మం, అన్యాయం కూడాను. నిజం మాటకు నాకూ ఆకలి అవుతూనే ఉన్నది. గౌరవంగానూ, నా దర్జాకు ఏమీ భంగం లేకుండానూ వ్యవహారం ఎల్లాగ కుదటబడుతుందా అని ఆలోచించాను.

ఆవిడ నిద్రపోయిన తరువాత, నేను మెల్లగా చప్పుడు కాకుండా దిగిపోయి అన్నం పెట్టుకు తినవచ్చు. ఇది మొదట్లో తోచిన ఆలోచన.

ఈ ఆలోచన వచ్చినందుకు నాలో నేనే సిగ్గుపడ్డాను. వట్టి దొంగపని అది. ఆవిడ వంటింట్లో ఏదో చప్పుడు అవుతున్న దని దిగివచ్చి చూస్తే ఎంత చులకన అయిపోతాను! పోనీ ఆవిడ వచ్చి చూడదు. చూడకపోతే ఆవిడ సంగతి ఏమిటీ?

ఆవిడ అల్లాగు పస్తు ఉండాలసిందేనా ? ఛీ అని ఆ ఆలోచనను దూరంగా నెట్టేశాను.

ఏదో సమయంచూచి, అనవసరంగా కోపం పెంచుకొని ముఖం ముడుచుకొని, నా మనస్సుకు కష్టం కలిగేలాగున ప్రవర్తించినందుకు, కాస్త కోప్పడి, దాని తరువాత దర్జాగా ఆవిడను క్షమించి, ఈ వ్యవహారం పరిష్కారం చెయ్యాలె. ఇది రెండో ఆలోచన.

ఈ అలోచన తోచినందుకు సంతోషించాను. ఇందులో ఏమీ తప్పులేదు. అన్యాయం, అధర్మం ఏమీ జరుగదు, వ్యవహారం గౌరవంగా పరిష్కారం అవుతుంది అని అనుకొన్నాను. ఈ కార్యం వెంటనే నిర్వహిస్తే, దాని తరువాత పెందలాడే భోజనాలు చెయ్యవచ్చు. అందుకని ఈ కార్యభారం నెత్తిమీద పెట్టుకొని మేడమెట్లు మెల్లగా దిగుతున్నాను.

ఆ సమయానికే ఆవిడా మేడమెట్లు ఎక్కుతున్నది. ఆవిడా సరిగ్గా అనుకొని ఉంటుంది. "ఎందుకొచ్చిన మనఃక్లేశము ఇది ! పాపము ఆయనకూ చిన్నతనమే. ఆయన కొంటెతనానికి అల్లాగ చూచినా పెద్ద ప్రమాదం ఏమీ జరుగలేదు. అల్లాగ చూడకూడదని చెప్పుకొని నావైపుకు తిప్పుకోవాలె" ఇల్లాగ అనుకొని ఆవిడా కార్యభారం నెత్తినేసుకొని పైకి వస్తున్నది మేడమెట్లు మెల్లగా ఎక్కుతూ,

మధ్యనే ఇద్దరం తారసిల్లాము. ఒకరి మొగము ఒకరు చూచుకునేసరికే ఇద్దరికీ మళ్ళీ పట్టుదలలు వచ్చినై. ఆవిడ చెప్పదల్చుకొంది అవిడా చెప్పలేకపోయింది. నేను అనుకున్న

దంతా నేనూ అనలేకపోయినాను. అల్లాంటప్పుడు ఎవరిదారిని వారు తలవంచుకొని వెళ్ళటమే మంచిపని,

కాని మేడమెట్లు ఇరుకైనవి. అట్టే వెడల్పులేదు. ఆవిడ పైగదిలోకే పోవాలనుకొంటే నన్ను రాచుకొని ఒక పక్కకు కాస్త నెట్టి తోసుకుపోవాలె, అల్లా చెయ్యాలన్నా వీలులేదు. ఎందుచేతనంటే ఆమె మడిగట్టుకొని ఉంది.

అందుకని ఆవిడ అన్నది. "కాస్త తప్పుకోండి. నేను పైకి వెడతాను'' అని తప్పుకోటం అంటే నేను వెనక్కి తిరిగి మళ్ళీ పైకి పోవాలె. అంతపని నేను ఎందుకు చెయ్యాలనుకున్నాను. ''నేను తప్పుకోను'' అన్నాను కోపంగా.

"నేను మడిగట్టుకొన్నాను. మిమ్ములను తాకితే మైల బడతాను. అందుకని కాస్త తప్పుకోవాలె.''

''నేను తప్పుకోను.''

''ఎందుకు తప్పుకోరూ?'' ఆవిడగారిని చీవాట్లు వేయటానికి ఇదే సమయమని తోచింది. కనుబొమలు చిట్లించి, గంభీరంగా, కోపంగా, అన్నాను పెద్దగా కంపిస్తున్న గొంతుకతో.

''నేను ఫూల్‌సుకు దారి ఇవ్వను"

''పోనీ నేనిస్తాను'' అంటూ ఆవిడ గిరుక్కున తిరిగి క్రిందికి పోతున్నది.

నేను నిర్ఘాంతపోయి అట్లాగే నిలువునా నిలబడిపోయినాను. ఏమిటి ఆవిడ అన్న ముక్కకు అర్థం అని ఆలోచిస్తూ ఒక్క నిమిషానికి అర్థం స్ఫురించింది.

నన్ను ఫూల్ అన్నా చాలా చమత్కారంగా అన్నదని సంతోషించి పరుగెత్తుకుంటూ వెళ్ళి ఆమెను కౌగలించు కొన్నాను. "మడి చెడకొట్టారు" అన్నది.

"ఫరవాలేదు వడ్డించు. ఇద్దరం ఒకేసారి భోజనం చేద్దాము" అన్నాను.

## 7

కాలం గడిచినకొద్దీ మా ఇద్దరిమధ్యా ఉన్న పరిచయం స్నేహంగానూ, స్నేహం స్నిగ్ధమైన ప్రేమగానూ మారినకొద్దీ కాంతంలో దాగిఉన్న కొంత విచిత్ర ప్రకృతి బైటపడసాగింది. మొదటి రోజుల్లో కొత్తవల్లా, సిగ్గువల్లా ఆమె విస్తారం మాట్లా డేదికాదు. పాతబడ్డ తరువాత ఆమె సంభాషణ కొత్తమెరుగులు పెట్టుకొంది. కొత్త అందాలు తెచ్చుకొంది.

ఆమె సౌందర్యాన్ని, ఆమె శరీరంలో ఉండే అందమైన వంపులను, రేఖలను, కోమలత్వాన్ని చూచి ఆనందించే వాడిని నేను మొదటి రోజులలో, తరువాత, వాటికంటే ఆమె చీత్కా రాలలోనూ, చీదరింపులలోనూ, సాధింపులతోనూ ఉన్న, ఉక్తి వైచిత్రియం, చమత్కారం, మాధుర్యం, నన్ను ఆకర్షించి నవి.

నేను తల దువ్వుకొంటున్నాను, నా జుట్టు బిరుసు, అణిగి పడి ఉండదు. అందుకని దువ్వెనతో చాలాసేపు దువ్వు తున్నాను, ఆ సమయంలో కాంతం నన్ను జూచి నవ్వింది.

నే నేదో షోకు జేసుకొంటున్నానని ఆమె అనుకొన్నది. "ఎందుకూ నవ్వు తున్నావు?" అని అడిగాను. కాంతం నవ్వు ఆపుకొని "ఎబ్బే, ఏంలేదు. ఎంత సేపు దువ్వినా ఉన్న అందం కంటే కొత్తది రాదుకగా" అని నవ్వుతున్నా నన్నది. నే నన్నానూ "అది కాదు కాంతం, ఈ జుట్టుకు నీ గుణమే అబ్బింది. ఎంత దువ్వినా లొంగడంలేదు" అన్నాను. "లొంగ కేంజేస్తుందండి" అంటూ ఆవిడ వచ్చి, కాస్త చెయ్యి తడిచేసు కొని, రుద్ది, పాపటదీసి చక్కగా దువ్వింది. అప్పుడు మళ్ళీ అన్నది "చూశారా, లొంగతీసుకొనే విధం తెలియక పోతే సరి" అని నిజానికి లొంగదీసుకొనే విధం ఆవిడకు తెలిసినంత బాగా నాకు ఎప్పుడూ తెలియలేదు. నేను అప్పటికీ ఇప్పటికీ అంతే.

లొంగతీయటం అంటే జ్ఞాపకం వచ్చింది. మేము భీమ వరంలో ఉండగా మాకు ఓ పోట్లావు ఉండేది. పాలు తీయ టానికి దాని దగ్గర కెడితే అది బుసలు కొడుతూ పొడవ వచ్చేది. దాన్ని ఎల్లాగయినా మచ్చిక చేసుకోవాలెనని మా ఆవిడ నానా అవస్థలూ పడుతూ ఉండేది. ఆవిడ దాని దగ్గరకు వెళ్ళి నప్పు డల్లా నేను ప్రాణాలు బిగబట్టుకొని కూర్చునే వాడిని. అది ఆవిడను ఎక్కడ కుమ్మేస్తుందో నన్న భయంతో.

మా ఆవిడ ఎంత ప్రయత్నించినా అది ఎన్నాళ్ళకూ స్వాధీనం కాకపోవటం చూచి చివరకు నే నన్నానూ, "కాంతం! ఈ పోట్ల గొడ్డును పెట్టుకొని మనం ఎన్నాళ్ళు కాపరం చేయగలం? దీన్ని అమ్మేద్దాము"

"అవ్వ—అదేమిటండీ అల్లా అంటారూ? పాడి గొడ్డును అమ్ముకొంటారుటండీ పోట్లదై తేమటుకూ! ఆ మాటకొస్తే నేను మిమ్ములను పెట్టుకు కాపరం చెయ్యటం లేదా?" అన్నది మా కాంతం.

నన్ను పోట్లగొడ్డుతో పోల్చినందుకు కష్టంవేసి నేనన్నానూ "అయితే కాంతం నేనూ పోట్లగొడ్డునే అంటావా?" కాంతం ముసి ముసి నవ్వులు నవ్వుతూ అన్నది "కాకేమండీ మీరు మటుకు మొదటి రోజుల్లో ఒక్కతీరాన స్వాధీనమైనారా? ఇంత కంటే ఎక్కువగానే బుసలుకొట్టారు. ఓపికపడితే ఎంత పోట్ల గొడ్డు అయినా లొంగుతుంది.

ఓపిక ఉండాలట! అది ఆవిడ అనేమాట. ఇంకో సందర్భం లో కూడా ఇల్లాగే ఓపిక ఉండాలని చెప్పింది. ఏమిటా అంటే ఒకరోజు నేను నా ఫౌన్టెన్‌పెన్ కనపడక, వెతు క్కొని వెతుక్కొని విసిగి చివరకు అడిగాను, "ఏమే కాంతం నా పెన్ ఏమైనా చూచావా? అని

"మీ వస్తువులు ఏవి ఎక్కడ పెట్టుకొంటారో నాకు ఏం తెలుస్తాయండీ? అయినా మీ పెన్‌తో నాకేం పని? నా మటుకు నేను అరగంటనుంచీ వెతుక్కుంటున్నాను అట్లకాడ కోసం, ఏంజేసేది చెప్పండి. వెతగ్గా వెతగ్గా ఇప్పటికి దొరికింది. మీరూ వెతుకోండి ఓపిగ్గా" అని హితవు చెప్పింది.

నవ్వుతూ అన్నమాటలే అయినా ఎంత నిగూఢమైన సత్యం ఉంది ఆమె మాటల్లో! జీవితంలో ఓపిక ఉండాలట! ఓపిక ఉంటే పోట్లగొడ్లూ లొంగుతై. పోయిన వస్తువులూ దొరుకుతై!

రామాయణంలో ఇంతకంటె గొప్ప సత్యాన్ని చెప్పలేదు వాల్మీకి! సీత పద్నాలుగేండ్లు వనవాసంచేసింది. జీవితం, జీవితం అంతా ఓపిక పట్టింది. మా ఆవిడా అమ్మాషే చెప్పింది ఓపిక ఉండాలని.

# 8

నేనొక సందర్భంలో అన్నానూ, నా కథలు మెచ్చుకోని వ్యక్తులతో నేను సాధారణంగా స్నేహం చెయ్యను. కాని ఇద్ద రున్నారు. వాళ్ళు నా కథలు ఎప్పుడూ మెచ్చుకోరు. అయినా నేను వాళ్ళను ఎక్కువగా గౌరవిస్తానూ అని! అందులో ఒకరు విశ్వనాథ సత్యనారాయణగారు, రెండవది నా భార్య!

ఆ మాట సత్యం. ఆవిడ నా కథలు బాగున్నాయని ఎప్పుడూ అనలేదు. నాకు ప్రపంచంలో ఉన్నతస్థానమూ, గౌరవమూ వస్తుందనే నమ్మకం ఆవిడకు ఎప్పుడూ లేదు. కాని నేనుమటుకు ఏవో ఆశలు పెట్టుకోనేవాడిని, ఎవరైనా ఏ సభకన్నా పిలిస్తే తప్పక వెళ్ళేవాడ్ని నేనే కర్చులు పెట్టుకొని. నేను పిచ్చితనం పట్టుతున్నాననీ, ఇల్లా ఉపన్యాసాలు ఇచ్చినంతమాత్రాన పేరు ప్రతిష్ఠలు వస్తాయన్నమాట భ్రమ అని ఆవిడ అంటూ ఉండేది.

ఆంగ్ల సాంప్రదాయం ప్రకారం ఏప్రిల్ మొదటి తారీఖు ఆల్ ఫూల్‌సుడే ఆ రోజున పెద్దా, చిన్నా అనే భేదం లేకుండా ఒకర్ని ఒకరు హాస్యం ఆడుకోవచ్చు. నేను ఒకరి మీదకు వెళ్ళటం ఎందుకు? మా కాంతాన్నే హాస్యం పట్టిద్దామని అన్నాను, "కాంతం నీవు పుట్టింది ఏప్రిల్ ఫస్టుగా. ఇవ్వాళ

నీ పుట్టినరోజు పండుగ కామాలు'' ఏప్రిల్ ఫస్టున పుట్టిన వాళ్ళంతా ఫూల్సు. కాంతంకూడా ఫూల్ అవుతుంది. ఇల్లాగ ఒక చిన్న విసురు విసిరాను. ఆమెకు అర్థమై నా సరసాన్ని గ్రహిస్తుంది అన్న నమ్మకంతోనే.

ఆమె చిన్నతనంలో కొన్నాళ్ళు స్కూలులో చదువుకొన్నది. అందుకని ఇట్టె గ్రహించి నవ్వింది. ఆ తరువాత అన్నది. ''నేను ఏ రోజున పుట్టానో నాకు మటుకు జ్ఞాపకం లేదు. కాని మీ కథలు విన్నవాళ్ళంతా—ఏమమ్మా నీవు ఏప్రిల్ ఫస్టున పుట్టావా ? అంతే అయిఉంటుంది, లేకపోతే అల్లాంటి పిచ్చి కథలను వ్రాసే ఆయనను చూస్తూ, చూస్తూ, ఎందుకు పెండ్లి చేసుకొన్నావ్ ! చేసుకొన్నా ఎందుకు కాపరంజేస్తావ్ ! అంటున్నారండీ'' అని విరగబడి నవ్వింది.

అల్లాంటి కథలను వ్రాసే ఫూల్‌తో కాపరం చేస్తున్నావు కాబట్టి, నీవు అంత కాకపోయినా ఏప్రిల్ ఫస్టున పుట్టిన ఫూల్‌వు అయిఉండాలని వాళ్ళు అన్నారన్నమాట. పోనీ ఇద్దరం ఫూల్సుమైనాము తగాదా లేకుండా, సరసానికి అన్నదేమాట. కాని నిజానికి ఆవిడ అభిప్రాయంకూడా అంతే నా కథలగురించి. అల్లాంటప్పుడు నేను ఉన్నతస్థితికి వస్తానని ఆమెకు నమ్మకం ఎల్లా ఉంటుంది ! ఆ మాటే అన్నది చమత్కారంగా ఒకసారి.

అదేమిటి అంటే గుడివాడలో ఒకసారి ఓ పెద్ద కవికి సన్మానం జరిగింది. ఆ సందర్భంలో జరిగే పండిత సభకు నన్నుకూడా ఆహ్వానం చేశారు. మా కాంతాన్ని పిలిచి ''నేను కాస్త గుడివాడదాకా వెళ్ళివస్తాను'' అన్నాను.

"ఇప్పటినుంచీ వెళ్ళకపోతేనేం?"

"అక్కడ కవిగారిని ఏనుగ ఎక్కిస్తారు."

"అయితే మీరెందుకూ వెళ్ళటం?"

"ఉత్సవం చూస్తాను"

"మిమ్మనుకూడా దేనిపైనన్నా ఎక్కిస్తారా?"

ఇల్లా వెటకారంగా అన్నది. ఆయనకు ఇంత పెద్దగౌరవం హఠాత్తుగా ఒక్క దెబ్బలో రాలేదు? అనేక సభల కెళ్ళి చిన్న చిన్న గౌరవాలను పొంది చివరకు ఈ గొప్పగౌరవాన్ని పొందు తున్నా డన్న ఉద్దేశంతో నేను అన్నాను, "అదికాదే పిచ్చి దానా, ఆయన ఇదివరలో ఎన్నో ఎక్కిఎక్కి చివరకు ఏనుగ ఎక్కుతున్నాడు. నేను ఇప్పు డిప్పుడే ప్రారంభిస్తున్నాను. కొన్నాళ్ళపాటు ఇల్లాగ అయిన తరువాత, నేనూ తప్పకుండా ఏను గెక్కుతాను" అని ఆవిడకు ధైర్యం చెప్పాను.

గుడివాడ వెళ్ళాను. సభలో నేనుకూడా కాసేపు మాట్లాడాను. ఆ రాత్రికే ఇంటికి వచ్చేశాను. భోజనాలు అయిన తరువాత మాట్లాడుకోటంలో ఈ ప్రసంగం వచ్చింది. గుడివాడ సభను గురించి కబుర్లు చెపుతున్నాను, ఇల్లా అన్నాను.

"నీవు చెప్పినమాట నిజం అయిందే కాంతం; అక్కడనన్ను మొదట్లో ఎవ్వరూ గౌరవించలేదు. చివరకు ఎవరో వచ్చి, మీరూ మాట్లాడండి అని బలవంతపెడితే మాట్లాడాను."

"వా డెవరో మీ దగ్గర చదువుకొన్న విద్యార్థి అయి ఉంటాడు."

"కావచ్చు" అని నవ్వాను. నిజంకూడా అదే. ఒకొక్కప్పుడు ఆవిడ చూచినట్లు చెప్పేస్తుంది ఎక్కడో జరిగిన విషయాలను గురించి.

"అయితే మిమ్మలను చూచి, వాళ్ళు ఆహ్వానించి కుర్చీ ఇవ్వలేదండీ?"

"ఇవ్వలేదు. చాలామందిమి అల్లాగే ఎక్కడ బడితే అక్కడ నుంచున్నాము సభావేదికకు దూరంగా."

"ఆయన చెప్పినదంతా వినబడ్డదా మరి?"

"మొదట్లో వినబడకపోతే దగ్గరలో ఉన్న ఒకగోడ ఎక్కి కూర్చుని విన్నాను."

కాంతం ఈ మాటమీద నవ్వి, "ఇంకేం ఏదో ఒకటి ఎక్కారు. ఇహ ముందు మీకు ఇంకా, ఇంకా ఉన్నత స్థానాలు లభిస్తయ్యి లెండి" అంది వెటకారంగా.

అవిడ అన్నమాట అక్షరాలా నిజమే అయింది. ప్రజలు నా కథలను మెచ్చి నన్ను దేనిపైన ఎక్కించలేదు. ఆవిడన్నట్లు మొన్న పాలకొల్లులో గోపురం నేనే ఎక్కాను. ఆవిధంగా ఉన్నత స్థానం లభించింది. నా కథలు పిచ్చికథలుగానే ఉండి పోయినాయి ప్రజల దృష్టిలో.

9

జీవితంలో ఆనందాన్ని ఇచ్చేది ఒక్క సౌందర్యమే కాదు. నిశితమైన మేధాశక్తీ, చమత్కారమైన మాట పొందికా కూడా కావలసినంత ఆనందాన్ని ఇస్తవి.

ఒకసారి మా అబ్బాయి ఏడుస్తూ ఇంటికి వచ్చాడు బడినుంచి, "ఏంరా నాయనా ఎందుకూ ఏడుస్తావూ" అని అడిగింది వాడి

తల్లి. "స్కూలులో మాష్టరు కొట్టేడే అమ్మా" అన్నాడు "ఎందుకు కొట్టాడురా నాయినా" అని బుజ్జగించి అడిగితే వాడు చెప్పాడు, "నే నేమీ అల్లరి చేయలేదే అమ్మా, మాష్టరుగారూ చైనా ఎక్కడుందో చెప్పమన్నారు. నేను చెప్పలేకపోయినానే, అపళంగా కొట్టారే" అని దావురు మని మళ్ళీ ఏడ్చాడు. ఇది విని "ఎందుకే అబ్బాయి ఏడుస్తున్నాడూ?" అని అడిగాను నేను.

"ఆ మాష్టరుకు చేతు లెల్లా వచ్చినయ్యో అనవసరంగా కొట్టాడు టండీ పిల్లవాడ్ని! చైనా ఎక్కడుందో చెప్పమన్నాడట, వీడు చిన్న వెధవాయె! ఎక్కడ పెట్టాడో ఏమో మరిచిపోయినాడు కామాలు చెప్పలేకపోయినాడు. అపళంగా ఆ మాష్టరుకు కోపం వచ్చి కొట్టేశాట్టండి! చూశారా!" అని అన్నది ఆవిడ నాతో, అంతటితో ఊరుకోక "ఏమిటిరా ఆ దరిద్రపుది? చైనా? ఎమిటది? అసలు దాన్ని నీ వెందుకు తీశావురా? నీకు ఎన్ని సార్లు చెప్పాను ఇంకోరివస్తువ ముట్టుకో వద్దని!" అని కుర్ర వాడ్ని కూడా కోప్పడ్డది.

మా ఆవిడ అట్టే ప్రయాణం చేసిన మనిషి కాదు. మద్రాసు వైపు ఏ స్టేషనులు ఉన్నయ్యో, కలకత్తావైపు ఏమి స్టేషనులు ఉన్నయ్యో ఆమెకు తెలియదు.

ఒకసారి నేను రాజమండ్రి పనిమీద వెడుతున్నాను. తీరా బండి ఎక్కే సమయానికి, కాంతం ఒక చిన్న జాడీతో ఆవకాయ తీసుకొచ్చి బండిలో పెట్టింది. "ఎవరికిది!" అని అడిగాను. "మా అక్కయ్యగారు ఈ సంవత్సరం ఆవకాయ

పెట్టుకోలేదట. పిల్లలు చద్ది అన్నాలలోకి ఏమీలేక ఇబ్బంది పడుతున్నారు. మీరు ఎట్లాగూ వెళ్ళుతున్నారుగా! కొంత్త వాళ్ళింట్లో ఇయ్యండి ఇది" అని జాలిగా బ్రతిమలాడింది ఆవిడ.

"మీ అక్కయ్యగారు గుంటూరులో ఉండిరి. నేను వెళ్ళేది రాజమండ్రి ఆయె! ఎట్లా ఇచ్చేది?" అని అడిగాను. "దార్లోనే కదండీ స్టేషను దగ్గరనే ఆమె మావాండ్ల ఇల్లు! ఈ బండిదిగి, ఇది ఇచ్చేసి. మళ్ళా వెంటనే ఇంకోబండి ఎక్కండి. పాపం మొన్న కబురుకూడా చేసిందండి కొంత్త పంపమని! అని మళ్ళీ దీనంగా అడిగింది.

ఆవిడ అజ్ఞానాన్ని చూచి నవ్వుకొని "తీసుకెళ్ళటానికికాదే. రాజమండ్రి దారిలో గుంటూరులేదు" అన్నాను. ఆవిడ ముఖం ఇంత జేసుకొని "పోనీలెండి. ఏం జేస్తానూ పట్టుకెళ్ళకపోతే!" అంటూ జాడీ తీసికెడుతున్నది.

ఆవిడ మనస్సు కష్టపడ్డది పాపం. అందుకని అసలు విషయం విప్పి తెలినేలాగున చెబుదామని "చూశావా కాంతం, నాకు ఈమాత్రం తీసికెళ్ళటానికి ఇష్టం లేదనుకుంటున్నావు కామాలు! అదికాదు. నిజంగా చెపుతున్నాను. రాజమండ్రి దారిలో గుంటూరు తగలదు" అన్నాను.

ఆ! తగలకేం జేస్తుందిలెండి. ఆపేక్షలుంటే బాగనే తగులుతుంది అని దీర్ఘాలు తీస్తూ లోపలికి వెళ్ళిపోయింది ఆవిడ. ఆవిడ అజ్ఞానాన్ని చూచి నాకు జాలీ వేసింది నవ్వూవచ్చింది.

తెలియక అన్నమాటలు ఇవి. తెలిసిన విషయాల్లో కూడా ఆమె ఒక్కొక్కప్పుడు అనేమాటలు బహు చమత్కారంగా

ఉండేవి. అవి యుద్ధపురోజులు యుద్ధనిధి వసూలు చేస్తున్నారు. ఒక్కరొక్కరి దగ్గరనుంచి ఒక అర్ధరూపాయి చొప్పున నేనూ ఒక అర్ధరూపాయి చందా ఇచ్చాను వాళ్ళకు. మా కాంతం ఇదంతా చూస్తూనేఉన్నది.

"ఎందుకండీ అర్ధరూపాయి ఇచ్చారూ?" అని అడిగింది.

"మన ప్రభుత్వంవారు జర్మనీతో గొప్పయుద్ధం చేస్తున్నారు. దానికి చాలా డబ్బు కావాలె. తలో అర్ధరూపాయి చందా ఇస్తున్నారు. నేనూ ఓ అర్ధరూపాయి ఇచ్చాను" అన్నాను.

ఆవిడ ఈ మాట విని విసుక్కొని "అర్ధరూపాయికి గతిలేని వాళ్ళు యుద్ధం ఎందుకు పెట్టుకోవాలె! అంతగా డబ్బు లేక పోతే కాస్త చేతిలో డబ్బు ఆడుతున్నప్పుడే, ఇటువంటి పనులు తలపెట్టాలగాని, వెనకాముందూ ఆలోచించకుండా లటిక్కిన యుద్ధంలోకి దిగి మనలను ఏడిపించడం మటుకు ఏమంత బాగుందండీ?" అంటూ నిరసనగా మాట్లాడింది.

ఇంకో విషయంలోకూడా ఇల్లాగే అమాయకంగా వెంకిగా అన్నమాటలు నాకు తల్చుకొన్నప్పుడల్లా నవ్వు వస్తూఉంటుంది. కొత్తటైము వచ్చినతరువాత జరిగిన విషయం ఇది.

ఓ రాత్రివేళ నాకు మెళకువ వచ్చింది. ఆవిడ కూడా మేలుకొంది. ఇద్దరం మాట్లాడుతూ కూర్చున్నాము. ఇంతలో దొరగారి బంగళాలో గంటలు కొట్టారు.

"ఎంత అయిందండీ టైము? ఎన్ని ఇప్పుడు కొట్టింది?" అని అడిగింది మా ఆవిడ.

"రెండు అయింది."

"రెండా అయింది: అయితే క్రొత్తటైము ప్రకారం రెండైతే మూడు కొట్టాలిగదండీ: మరి రెండే కొట్టారేం?" అని అడిగింది.

ఈ ప్రశ్నకు ఏమి చెప్పాలిసింది తోచలేదు. రెండు అయితే మూడు కొట్టాలట! చివరకు ఆలోచించి ఇల్లా అన్నాను, "అవునే కాంతం! ఇప్పుడు పాతటైము ప్రకారం ఒకటే అయింది అన్నమాట" ఈమాట విని ఆమె తృప్తి పడక "నాబొంద, ఒకటైతే రెండు కొట్టటం ఏమిటండీ వాడి శ్రాద్ధం" అని అసహ్యించుకొన్నది.

ఇది అర్థంలేని పెంకిమాట. ఒక్కొక్కప్పుడు మెరుపులాంటి మేధాశక్తితో ఠపీమని అనేస్తుంది. దాని తరువాత ఆ దెబ్బకు తట్టుకొని, నవ్వే శక్తి ఉంది కాబట్టి నేను నవ్వుకొని ఊరుకొనేవాడ్ని.

విశ్వనాథ సత్యనారాయణగారిదగ్గరకు ఒకసారి నేను వెళ్ళాను. ఆ రోజులలో ఆయన 'జయంతి' అనే పత్రిక నడిపి, కొన్ని కారణాలవల్ల దాన్ని ఆపేశారు. పత్రిక నడపటంలో ఉండే కష్టసుఖాలు ఆయనకు బాగా తెలిసినై. సాహితి అనే పత్రికకూడా అల్లాగే ఆగిపోయి వున్నది అప్పటికి.

సాహితీపత్రికను నేను తీసుకొందామని అనుకొన్నాను. అనుకొని పత్రిక నడపటంలో ఉండే మెలకువలన్నీ తెలుసుకొందామని సత్యనారాయణగారి దగ్గరకు వచ్చి, ఆయనతో అన్నాను "ఏమండీ నేను సాహితీ పత్రిక నడపుదామని అనుకొంటున్నానండీ" అని.

ఆయన చప్పున "నీవేమైనా ఫూల్‌వా" అని అడిగాడు. అప్పటికి నాకూ ఆయనకు అట్టే పరిచయంలేదు. అయినా ఇంత మాట ఆయన స్వతంత్రించి అన్నాడు.

సరే అయిపోయింది, ఇంటి కొచ్చేశాను. సత్యనారాయణ గారు ఇంతమాట అన్నారే అని మనస్సులో కష్టంగా ఉంది. మా ఆవిడకు సత్యనారాయణగారంటే ఎంతో గౌరవం. ఆయన పద్యాలు చదివి ఆనందిస్తూ ఉండేది. ఆయన గొప్ప కవి అని నాకు ఎప్పుడూ చెబుతూ ఉండేది.

మా ఆవిడ నా కథలను ఏమాత్రం మెచ్చుకోకపోవటం, నా ఎదటే ఆయనను అంతగా ఎక్కువగా పొగడటం నాకు బొత్తిగా గిట్టేదికాదు.

నా మనస్సు చివుక్కుమనేట్లు, నన్ను ఆయన ఇంతమాట అన్నాడు అని చెప్పినమీదనైనా, మా ఆవిడకు సత్యనారాయణ గారి యందుండే గౌరవభావం కొంచెం తగ్గదా అని యోచించి, ఒక రోజున కాంతంతో అన్నాను "చూశావా కాంతం! నువ్వేదో ఆయనను మెచ్చుకొంటావుగాని, ఆయన మర్యాద తెలిసిన మనిషి కాదూ" అని. "ఏం? ఎందుకల్లా అంటున్నారు?" అని అడిగింది ఆవిడ.

విషయం అంతా చెప్పుకొన్నాను. నాకూ ఆయనకూ పెద్ద స్నేహమాలేదు. మాట్లాడుకున్నాము. ఎంతోసేపు కూడా కాలేదే! నాలు గైదు నిమిషాలు అయింది, నన్ను ఫూల్ అన్నాడు!!

"అంత ఆలస్యం ఎందుకైందండి. ఎంతసేపు పట్టిందో ఆయన మీ సంగతి కనుక్కొంటానికి" అని కాంతం విరగబడి నవ్వింది.

ఇంతకూ సత్యనారాయణగారి విషయమై ఆమెకు గల అభి ప్రాయాన్ని నేను రవ్వంత అయినా మార్చలేకపోయినాను. ఆయన వ్రాసిన కిన్నెరసాని పాటలు మటుకు ఆవిడ క్రొత్త క్రొత్త ఫణుతులల్లో పాడేది. ఆవిడ పాడుతూ ఉంటే నాకు నృత్యము చేయాలనిపించేది. అంత ఆనందం కలిగేది.

అయితే వారు వ్రాసిన ఇతర గ్రంథాలు ఆమెకు పూర్తిగా అర్థమయ్యేవికావు. కాకపోయినా చదివి ఆనందించేది. ఈ విషయం ఆధారంగా తీసుకొని ఒకసారి నేను ఆవిడను ఎత్తి పొడుపుగా అన్నాను.

''ఆయన వ్రాసిన గ్రంథాలు నీకు ఏమి అర్థమైనవనీ, నీవు ఆయనను మెచ్చుకుంటావు? ఆయన చాలా గొప్పకవి, అంత వాడు ఇంకోడులేడు అంటావ్, ఆయన ఔన్నత్యం ఏమి చూశావ్?''

'' నే నేమీ చూడక్కరలేదు. నేను చూడకపోతే మటుకు హిమాలయ పర్వతాలు ఉన్నతమైనవి కావుటండీ!!'' అన్నది విసురుగా.

## 10

మా ఇంటికి ఒకటి రెండు తెలుగు పత్రికలు వస్తయి. పత్రి కలలో కథలూ కబుర్లూ ఉంటై అనీ, ఈ విశాల ప్రపంచంలో ఎక్కడెక్కడ ఏ యుద్ధం జరుగుచున్నదో, మానవజాతి స్వాతంత్ర్యంకోసం ఏ మూల ఎల్లాటి ప్రయత్నాలు చేస్తున్నదో తెలుస్తుంది, ఇతర దేశాలలో స్త్రీలు ఎంత అభివృద్ధిలో ఉన్నారో కూడా తెలుస్తాయి అని ఎన్నో విధాల చెప్పాను మా ఆవిడకు.

ఎన్ని జెప్పినా ఆవిడ పేపరు చదివి జ్ఞానం వృద్ధిచేసుకొనేది కాదు. "ఎవ రెట్లా ఏడిస్తే మనకేం? వాళ్ళ గొడవలన్నీ మన కెందుకండీ" అనేది.

"వాళ్ళ గొడవలు మనకు కావాలె. ఇప్పుడు చూడు వాళ్ళ యుద్ధంవల్లనే మనకు ధరలు ఇల్లాగ పెరిగిపోయినై."

"ఆ మాట తెలుసుకొంటానికి పేపరు చదవనక్కరలేదు లెండి" అని ఇల్లాగ మొండిగా జవాబులు చెపుతూ ఉండేది.

ఇంకా బాగా నచ్చచెబుదామని ఒక రోజున అన్నాను "కాంతం ఎంతజెప్పినా నీవు పేపరు చదవటం లేదు నాకు చాలా కష్టంగా ఉంది. నీవు పేపరు చదివితే అందులో ఉండే విషయాలనుగురించి ఇద్దరం సరదాగా చర్చించుకొందాం. ఇందు కోసం అయినా చదువుదూ" అని బ్రతిమిలాడినట్టు అన్నాను.

ఈ మాట విని కాంతం విరగబడి నవ్వి "పేపర్లో విషయాలను గురించి మనం చర్చలు చేయాలటండీ. నా బొంద! మన కున్న విషయాలు చాలులెండి!" అన్నది.

"రాజకీయ విషయాలను గురించీ, ప్రభుత్వాన్ని గురించీ నాతో చర్చ చేయటం నీకు సరదాగా ఉండదా?" అని అడిగాను.

"సరదాకు ఆ విషయాలుదాకా ఎందుకండీ? మనకున్న గొడవల మీద కావలసినంత చర్చ జరుగుచున్నది రోజూనూ. అబ్బాయికి ఎర్రచొక్కా కుట్టిస్తానంటే మీరు వద్దు ఎర్రచొక్కా ఏమిటి, అసహ్యంగా ఉంటుంది. తెల్లని తెలుపు కుట్టిస్తానని నాతో అర గంట వాదిస్తిరి. పెద్ద అమ్మాయికి జూకాలు చేయిస్తానంటే, జూకాలు అందంకాదు. స్వస్తిక లోలకులు చేయిస్తానని ఎంత

నేపు కోప్పడ్డారు!! ఇంకా ముందు ముందు పెండ్లిండ్ల విష యంలో, కట్నాలూ కానుకల విషయంలో, అల్లుళ్ళను తీసు కొచ్చే విషయాలలో అభిప్రాయ భేదాలకూ, చర్చలకూ కావలసి నంత అవకాశం ఉంది. ఇంకా కొత్తగొడవలు ఎందుకులెండి'' అని దీర్ఘాలు తీసింది.

అయినా నేను వదలక ఆవిడను వేధిస్తునే వచ్చాను పేపరు చదవమని. నా గోల పడలేక ఆ తరువాత పేపరు చూడటం మటుకు చూసేది వెండి ధర, నవరసుల ధర ఆవిడ ముఖ్యంగా చూసేది. ఆ తరువాత ఎవరైనా కుర్రవాడు కనపడటంలేదు, పారిపోయినాడు అన్న సంగతులూ, పెండ్లికొడుకు కావాలె అన్న ప్రకటనలూకూడా చదివి పేపరు అవతల పారేశేది. పోనీ ఏదో ఒకటి చూస్తున్నది. అదీ కాస్త మంచిదే. ప్రస్తుతం ఈ విషయాలు మాత్రమే చూచినా ముందు ముందు ఇంకా మంచి విషయాలను చూచి ఆమె జ్ఞానం వృద్ధిచేసుకొంటుందని నేను ఆశపడ్డాను.

కాని ఏ ముసలమ్మో వచ్చి, ఆవిడకు కలిగిన ఈ కాస్త ఆసక్తినీ పాడుచేస్తుండేది. ఓ రోజున మా ఆవిడకు పేపరు ఇచ్చి చదవమని చెప్పి, నేను బైట వరండాలో కూర్చున్నాను. ఇంతలో ఒక ముసలమ్మ వచ్చి అడిగింది ఈవిడను, ''అమ్మాయీ ఇందులో ఏముంటుందీ'' అని. ''అన్నీ ఉంటాయి అండి అవ్వగారూ, ఎవరు ఏమిచేసిందీ, ఎవరి కుర్రవాడు ఎప్పుడు పారిపోయిందీ, ఎవరింట్లో పెండ్లి ఈడువచ్చిన పిల్లయుందీ, ఇల్లాంటి సంగతు లన్నీ తెలుస్తాయండీ పిన్నిగారూ'' అన్నది మా కాంతం. పేపరులో ఉండే విషయాలు ఇవే అయినట్టు!!

ముసలమ్మ తెల్లపోయి "అయితే అమ్మాయీ మా మనమ రాలుకు పెండ్లి కావాలె. కాస్త మంచి సంబంధాలు ఎక్క-డున్నాయో తెలుస్తుందా అమ్మా ఇందులో చూస్తే?" అని అడిగింది.

"ఆఁహ తెలియవమ్మా."

"అయితే ఎందుకమ్మా ఇదీ తగలెయ్యనా?"

"అయితే ఒకటండీ పిన్నిగారూ, మా పిల్లకు మొగుడు కావాలె. పిల్ల వయస్సు ఇంత. అందంగా ఉంటుంది. ఎవరన్నా చేసుకోదల్చుకొంటే మాకు వ్రాయండి. అని పత్రికలో ప్రకటన ఒకటి చేయవచ్చు."

"పత్రికలో వేయించ మంచావుటమ్మా, అల్లరి బ్రతుకు అయిపోదూ! అప్రాచ్యులు ఎవరైనా వేయించుకొంటే వేయించు కొంచాడు!"

"పోనీలెండి అవ్వగారూ, వేయించవద్దు లెండి. పోనీ మీరు కూడా పేపరు చదవటం నేర్చుకోండి"

"ఎందుకమ్మా నేర్చుకోవటం!"

"అనేక సంగతులు తెలుస్తాయండీ!"

"ఏదీ ఒక్క నంగతి చెప్పు చూద్దామూ?"

"కొన్ని దేశాలలో ఆడవాళ్ళు పురుషులతో సమానంగా అన్ని హక్కులూ కావాలని పోట్లాడుతున్నారు. చూశారా ఇల్లాంటి సంగతులు ఎన్నో తెలుస్తయి"

ఆ ముసలమ్మ ఆశ్చర్యపడి కాంతాన్ని అడిగింది "సమాన హక్కులు అంటే ఏమిటమ్మా, ఇప్పుడు మనకు సమాన హక్కులు లేవనే అంచావా?" అని.

మా కాంతం గిరగిరా తలతిప్పుతూ "లేవండీ మనకు సమాన హక్కులు లేవట! మనము చాలా నీచ స్థితిలో అవిద్యలో అవివేకంలో ఉన్నామట!" అన్నది. "వాళ్ళ బొంద! మన మేమిటి, నీచస్థితిలో ఉండటమేమిటి!—వాళ్ళదే నీచస్థితి. ఏం విచిత్రమమ్మా ఇది!" అన్నది ముసలమ్మ.

"ఇంకా విచిత్రమైన విషయాలున్నాయి అండీ అవ్వగారూ! ఇంకో సంగతి చూశారూ! ఇప్పుడు ఆడవాండ్లు యుద్ధాలలో కూడా పోట్లాడాలని చూస్తూన్నారుటండీ" అన్నది కాంతం.

ఈ మాట విని ముసలమ్మ ముక్కుపైన వేలు వేసుకొని, యుద్ధంలో పోట్లాడటమే! వాళ్ళ తాడు తెగిరి! అంత పోట్లాడాలని ఉంటే ఎవరి మొగుడితో వారు అంచక్కా పోట్లాడుకోవాలె గాని, ఇల్లు వదలి బైటపడి ఇంకొకరితో పోట్లాడుతా నంటారు అదేం పొయ్యేకాలం!! అయ్యో, అయ్యో! ఇవా పేపర్లల్లో ఉండే సంగతులు! వీటిని తగలెయ్య!!! మా ఆయన నన్ను చంపుతున్నారు అక్షరాలు నేర్చుకో పేపరు చదువుదుగానని, ఇంకా నయం ముందుగానే చెప్పావు!! ఇల్లాంటి సంగతులు నేర్చుకొంటానికి పేపరు చదవనక్కరలేదు" అంటూ చీదరించుకొని మాట్లాడింది.

ఈ మాటమీద కాంతం అన్నది "అల్లా అనకండి అవ్వగారూ, మీకు కావలసిన సంగతులూ ఉంటై ఇందులో" అని ఎందుకో కాంతం విరగబడి నవ్వింది.

ముసలమ్మగారు యథాలాపంగా ఆవిడ చేతులో పేపరు తీసుకొని అటు తిరగేసి ఇటు తిరగేసి, "అయితే అమ్మాయీ ఈ

కాయితంలో అంతా అచ్చువేసి, ఈ కాస్తమేర వదిలేశారేం?'' అది అడిగింది Stop Press చూపిస్తూ.

''అక్షరాలు రాని మీబోటి ముసలమ్మలు కూడా పేపరు చూడాలంటే ఎట్లా? ఎక్కడ చూచినా ఏమీ తెలియదాయె. అందుకని ఆ కాస్తమేరా అట్టి పెట్టారు అల్లాంటివాళ్ళు చూడటానికి'' అంటూ మళ్ళీ కాంతం విరగబడి నవ్వింది.

పేపరు చదవటాన్ని గురించిన ప్రసంగం ఇల్లాగ వెటకారాలతోనూ, వెక్కిరింపులతోనూ వెళ్ళిపోయేది. మొత్తంమీద కాంతానికి పేపరు చదవాలనే ఆసక్తి కలుగజేయలేక పోయినాను. కొన్నాళ్ళయిన తరువాత ''ఏం కాంతం! పేపరుచూడటం బొత్తిగా మానేసినట్టున్నావే'' అని నేను అడిగితే, ''ఆc—ఎందుకు పోనిద్దురూ, ఏముంటుంది పేపర్లో. అన్నీ పిచ్చిసంగతులేకదండీ, లండనుపైన బాంబులు పడ్డాయి, ఢిల్లీలో గాడిదలు ఊరేగినై. గుంటూరులో కోమటికి కడుపునొప్పి వచ్చింది, తెనాలిలో మిల్లు తగలబడ్డదీ, ఇలాంటి సంగతులే కదండీ! ఇల్లాంటి సంగతులు తెలిసికోకపోతే వచ్చిన నష్టం ఏమీలేదులెండి. నన్ను చంపకండి పేపరు చదవమని'' అని చీత్కారంగా అన్నది.

## 11

మా కాంతానికి పూర్వకాలంవాళ్ళు అన్నా, పూర్వకాలపు పాటన్నా ఎంతో అభిమానం. ఇప్పటి కాలపు పాటలు ఆవిడకు ఇష్టంలేదు. ఇప్పటికాలపు చదువులూ ఆమెకు ఇష్టంలేదు. పూర్వ

కొలపు మనుష్యులే మనుష్యులనీ, ఈ కాలపువాళ్ళు అంతా చచ్చు రకం అనీ ఆమె అభిప్రాయం.

"ఈ కాలపు మనుష్యు లేముందండీ, ఇంత తిననూలేరు. తిరగనూలేరు వట్టి చవటలండీ" అని అంటూ ఉండేది. "ఏం? ఎందుచేతా?" అని నేను అడిగితే పూర్వకాలపు కథలు చెప్పేది.

"భారతంలో చూడలేదండీ, గరుత్మంతుడికి ఒకసారి మాంచి ఆకలైతే తల్లిని అడిగాడట 'ఆహారం ఇవ్వవలసింది తల్లీ' అని. ఆ మహానుభావుడికి తల్లిమటుకు ఎక్కడనుంచి తెచ్చి ఇస్తుందీ ఆహారము."

"ఏం? ఇంట్లో అన్నం వండదా ఆవిడ? పోనీ కాఫీ హోటలుకు పంపలేకపోయిందా? అని అన్నాను నేను నవ్వుతూ.

"ఏమిటండీ గరుడుడికి కాస్త ఉప్మా తింటే ఆకలి తీరుతుందా?" అని ఆవిడ నవ్వేది. "అందుకని తల్లి ఏంజేసింది చెప్పు?" అని నేను కథ నిజంగా వినాలని కుతూహలం ఉన్నవాడిలాగ మాట్లాడేవాడిని. నిజానికి ఆ పిచ్చికథలు వినాలని నా కేమీ సరదా ఉండేదికాదు. వినకపోతే ఆమె మనస్సు కష్టపడుతుందని, ఉత్సాహాన్ని నటించక తప్పేదికాదు.

అక్కడనుంచి ఆవిడ చేతులు విలాసంగా తిప్పుతూ, కళ్ళు ఎగరేస్తూ ఉత్సుకతతో చెప్పుకొచ్చేది కథ. తల్లి గరుడుడితో అన్నదటా--నాయనా నేనేం ఆహారం ఇయ్యగలను. ఒక్కటి చెయ్యి. ఘననిధి మధ్యన ఉన్నవంటినీ, ప్రజలను ఎక్కువగా పీడిస్తూ ఉన్నవంటినీ, నిషాదులనే వారిని భక్షించ

వలసింది అని అన్నషువంటిదైందట. ఉద్రిక్త అయినపుడు ఆవిడకు ఇల్లాంటి భాష మాట్లాడటం సరదా.

ఈ మాటలు విని నేను సంతోషంగా తల ఊపితే మళ్ళీ ఆవిడ ఇల్లా చెప్పింది. "అపళంగా ఆ గరుడాళ్వారు విషనిధి జొచ్చి బలసమన్వితులు అయినషువంటిన్నీ దీర్ఘకాయులు అయినషువంటిన్నీ నిషాదులను కొన్నివేలమందిని భక్షించాడట! ఇల్లాంటివాళ్ళు ఉండేవాళ్ళండీ పూర్వకాలంలో! ఇప్పటి కాలం వాళ్లు ఒక్క వేయి మామిడిపండ్లు అయినా తినగలరా?

"మామిడిపండ్లదాకా ఎందుకూ? ఒక్క వెయ్యి రేగుపండ్లు కూడా తినలేరు" అని నేనన్నాను.

ఆవిడకు ఎక్కడలేని సంతోషం కలిగింది. తన కుటుంబంలో పూర్వీకులుకూడా చాలా బలం కలవారనీ యోగ్యులనీ, భక్తులనీ చెవుతూ ఉండేది.

మా ఆవిడ పుట్టిల్లు ఒక కుగ్రామం. ఆ ఊరికి కృష్ణ రెండు మైళ్ళ దూరంలో ఉంది. వాళ్ళమ్మ, నాలుగు బిందెలు పట్టే పెద్ద కాగుతో కృష్ణనుంచి మంచినీళ్ళు మోసుకొని వచ్చేదట ఈ రెండు మైళ్ళూ ఇసుకలో నడిచి.

వాళ్ళ నాన్న తెల్లవారుఝూమున నాలుగు గంటలకు బెజవాడలో బయలుదేరి పదకొండింటికల్లా భోజనానికి బందరు వెళ్ళేవాడట. ఎప్పుడైనా కోర్టు పనిమీద వెళ్ళాలసివస్తే!

వాళ్ళ ఊరుచుట్టూఉన్న భూములలో సగం భూములు వాళ్ళవేనట। కాని వాళ్ళ తాతా, తండ్రీ అవన్నీ అమ్మేశారట! ఇల్లాంటి విషయాలు ఆవిడ ఎన్నో చెబుతుండేది.

మా పూర్వీకులుకూడా చాలా గొప్పవాళ్ళు అని నేనూ చెప్పటం అవసరమని తోచింది. ఏం? వాళ్ళ పూర్వీకులు గొప్పవాళ్ళు అయితే మా పూర్వీకులు చాలా గొప్పవాళ్ళే ఎందుకు కారూ!

మాది మొదటినుంచి బస్తీ కాపురం, పల్లెటూళ్ళల్లో కాపురం అంటే మా వాళ్ళకు మొదటినుంచి అసహ్యం. మాకు పొలాలు లేవు గాని, ఈ వూరులో ఉన్న మేడల్లో సగం మేడలు మా ముత్తాతగారు కట్టించినవే. మా తాతగారి కాలంలో అవన్నీ అమ్మేశాం. ఇల్లా ప్రారంభించాను.

ఆవిడ అడిగింది "కేకినీమహల్ కూడా మీ తాతగారు కట్టించిందేనా" అని. అవునన్నాను నేను బెరుకు లేకుండా, "అయితే మీ తాతగారు తాపీ మేస్త్రీ-అయినా అయి ఉండాలె, లేకపోతే కంట్రాక్టరు అయినా అయి ఉండాలె" అని ఆవిడగారు నవ్వింది.

నాకు కాస్త కోపం వచ్చింది కాని. ఇంకా కోపమూ, విసుకూ పైకిచూపే రోజులు కావు అవి. అందుకని నేనూ నవ్వి 'అట్లా కాదు నిజం" అన్నాను. ఆవిడ అమాయకంగా నా వంక చూచింది. సరే, ఇంకేం నా మాటలు నమ్ముతున్నదనుకొని మళ్ళీ కొన్ని సంగతులు చెప్పాను.

అది మా తాతగారి సంగతి. మా తాతగారు కడుపునిండా భోజనం చేసి, నడ్డిగం బిగించి, వసారాలో గోడకు జేర్లాబడి చుట్ట వెలిగించాడా అంటే, అది ఆ రాత్రి రాత్రి అంతానూ, మర్నాడు మధ్యాహ్నం పన్నెండు గంటలదాకానూ కాలుతూ ఉండేది.

"అబ్బా అంత పెద్దచుట్ట కాల్చేవాడండీ! అయితే ఆయన నిద్రపోవటం లేదన్నమాట?"

"ఇదేనా నీవు గ్రహించింది? నిద్రలోకూడా అల్లాగ అల్లాగ చుట్ట కాలుస్తూ ఉండే వాడన్నమాట గుప్ గుప్పున పొగ వదులుతూ."

"నిజమే! ఉంటారు! అందులో వైపరీత్యం ఏమీ లేదండీ" అన్నది ఆవిడ.

ఇంకొకటి చూశావూ కాంతం నీవు చెప్పినట్లు పూర్వకాలం సంగతే వేరు! మనుష్యుల సంగతేకాదు. ప్రకృతి కూడా మారిపోయింది. ఎప్పటిదాకానో ఎందుకు నా చిన్నతనంలో ఉన్నట్లు ఇప్పుడు లేదు కాలం. నా చిన్నతనంకూడా పూర్వకాలంలో లెఖ్కే, బాగా జ్ఞాపకం. ఆ రోజుల్లో చంద్రగ్రహణం, సూర్యగ్రహణం, ఇల్లాంటివి చూశావూ ఒక్కసారి పట్టినాయా అంటే, ఆ పట్టు పట్టు మూడురోజులు నాలుగు రోజులు అల్లాగ ఉండిపోయేవి! ఇప్పుడేముంది. ఒక అరగంట! మహాఉంటే గంట!

ఇల్లాగ నేనూ చెప్పేవాడ్ని మా పూర్వులను గురించీ వాళ్ళ ధైర్యసాహసాలనుగురించి. ఎంత చెప్పినా, ఆవిడ లోపల ఉద్దేశం ఏమిటంటే, వాళ్ళ పూర్వీకులంత గొప్పవాళ్ళు, మా వాళ్ళు కారనే. గ్రహణాలు మూడు రోజులదాకా పట్టటం నే నెరుగుదునని చెప్పిన తరువాతనైనా నేను కూడా, ఆ పూర్వ కాలపు గొప్పవాళ్ళతో సమానమైన ప్రతిభ కలవాడిని అని ఆమె అనుకొందో లేదో, నాకు తెలియదు.

# 12

ఒక రోజున మా అబ్బాయిని పిలిచి గుర్రం మీద కాంపోజిషన్ వ్రాశావురా నాయనా అన్నాను. "గుర్రం మీద వ్రాయటం ఎందుకండీ" అన్నది కాంతం. "పిల్లలకు చదువు చెప్పే సమయంలో నీవు అడ్డుగాకు. నీకెందుకూ, నీవు ఊరుకో" అని ఆవిడను కోప్పడ్డాను.

ఆ మాత్రానికి ఊరుకునే మనిషి అయితే ఆవిడ ఇంకా అనుకోవలసిం దేముంది? అహ, ఊరుకోలేదు. ఊరుకోక "గుర్రంమీద వ్రాయటం ఏమిటో నాకు చెప్పకూడదా ఏమిటండీ? అయినా ఇల్లాటి వెధవపనులు నేర్పబోకండి. గుర్రాల మీద గాడిదలమీద వ్రాయటం. పిల్లలు చెడిపోగలరు" అంటూ కొంచం విసుక్కున్నది.

"గుర్రంమీద వ్రాయటం అంటే గుర్రాన్ని గురించి వ్రాయటమే ఇప్పుడు తెలిసిందా?" అని అడిగాను. ఈజబాబుతో ఆమె తృప్తిపడుతుం దనుకొన్నాను. కాంతం ఒక్క క్షణం తీక్షణంగా ఆలోచించి "అల్లాగ అయితే గుర్రాన్ని గురించి మటుకు వ్రాయటం ఎందుకండీ" అన్నది ఒక పెద్ద సందేహం తనకు బాధిస్తున్నట్టు చూస్తూ.

నేను ఈ ప్రశ్నకు ఏమీ జవాబుచెప్పలేక ఊరుకొన్నాను. ఆమెగారు ఊరుకోక "గుర్రాలను గురించీ, గాడిదలను గురించీ కూడా నేర్చుకోవాలే ఏమిటండి అబ్బాయీ?" అన్నది దీర్ఘాలు తీస్తూ ఈసడింపుగా.

"గుర్రాలను గురించి గాడిదలను గురించి మనం నేర్చుకోవలసింది ఎంత ఉందో నీకేం తెలుసు! అదో పెద్దశాస్త్రం."

"నిజమేలెండి. గాడిదలనుగురించి నాకు ఏమీ తెలియదు. ఇన్నాళ్ళబట్టీ తెలియకుండానే జరిగింది. అబ్బాయికి తెలియటం అవసరమా?"

"ఆఁ, చాలా అవసరం. ఎందుకు అవసరమో ఇల్లాంటి విషయాలు ఎందుకు నేర్చుకోవాలో నీకు తెలినేటట్లు చెప్పాలంటే చాలా సేపు పడుతుంది. నాకు ఇప్పుడు అంత ఓపిక లేదు. కాస్త నాలుగుముక్కలు వాడికి చెప్పనియ్యి" అన్నాను.

"అయ్యో, నేను వద్దు అని అన్నానా ఏదో ఊరికే అడిగాను గాని! గుర్రాలను గురించి, కుక్కలను గురించి చెప్పండి" అన్నది ఆవిడ ముక్కూ మూతీ విరిచి, ఈ చదువు ఎందుకూ పనికొచ్చేది కాదన్నట్లు తలతిప్పుతూ.

ఇల్లాగ అన్నా నేనేమీ చిన్నబుచ్చుకోలేదు. ఈ మాత్రానికి నిరుత్సాహపడితే నేను అసలు బడిపంతులు పని చెయ్యనే లేను.

ఎందుచేతనంటారా, క్లాసులో మనం పాఠం చెబుతూఉంటే ఒక్కొక్కప్పుడు ఒక్కడూ వినడు. ఏమిటి వినేది వెధనమోత అన్నట్లు వేరే మాట్లాడుకుంటూ ఉంటారు. అయినా మనం నిరుత్సాహపడము. పాఠమూ ఆపివెయ్యము. అల్లాంటప్పుడు ఈవిడగారు కాస్త ముక్కిందని నేను ఊరుకొంటానా?

అబ్బాయిని పిలిచి నీవు వ్రాసిన కాంపోజిషన్ చదవరా అన్నాను. వాడు పుస్తకంతెచ్చి నాముందు కూర్చున్నాడు.

"ఊఁ, ఏంవ్రాశావో చదువు?"

"గుర్రమును గాడిదయు ఒక జాతిలోని జంతువులు." ఈ వాక్యంవిని కాంతం, మళ్ళీ విరగబడినవ్వి "అదేమిట్రానాయనా, గుర్రం గాడిదా ఒకటేనట్రా ఇదేం చదువురా?" అంటూ వెకిలిగా నవ్వటం సాగించింది.

నాకుమటుకు మహా చెడ్డకోపం వచ్చింది. ఈ ఆడవాళ్ళకు ఏమీ తెలియనూ తెలియదూ. పైగా మనను వెక్కిరిస్తారు.

చివరకు "నీకు తెలియదు, ఊరుకో ఆ రెండూ ఒక జాతిలోనివే" అని నేను గట్టిగా కోపడ్డాను, కోపడ్డాగదా అని ఏమన్నా ఊరుకొందా!

"క్షమించండి. నే నేమన్నా చదువుకొన్నానా ఏమన్నానా? గుర్రం గాడిదా ఒకటే అని తెలియటానికి! చదువుకొన్న వాళ్ళకు తెలుస్తయ్యి గుర్రం గాడిదా ఒకటే అన్న సంగతి?" అని అంటూ మళ్ళీ విరగబడి నవ్వింది.

ఈ ధోరణిచూస్తే నాకుకూడా కొంచెం సందేహం కలిగింది, నిజంగా గుర్రం గాడిదా ఒక జాతిలోనివేనా, లేక నేను పొరపడుతున్నానా అని. ఆ రెండూ ఒక జాతిలోనివే అని మళ్ళీ నిశ్చయించుకొని ఆపైన చదవరా నాయినా అన్నాను అబ్బాయితో, వాడు తాను వ్రాసిన కాంపోజిషన్‌లో రెండో వాక్యం చదివాడు గుర్రానికి నాలుగు కాళ్ళు ఉన్నవి అని.

"నిజంగానురా? నాలుగుకాళ్ళే!! గుర్రానికి నాలుగు కాళ్ళు ఉన్నాయని అబ్బాయికి ఎల్లా తెలిసిందండీ?" అంటూ ఆవిడ మళ్ళీ పగలబడి నవ్వింది.

"ఎందుకు అల్లాగ నవ్వుతావు? గుర్రానికి నాలుగు కాళ్ళు లేవా?" అన్నాను నేను కొంచం కోపంగా.

"ఏమండోయ్, మీ కేమన్నా మతిపోయిందా ఏమిటి? గుర్రానికి నాలుగు కాళ్ళండీ?" అని నే నేదో వెర్రివాడిని అయి నట్టు నావంక జూచి మళ్ళీ నవ్వటం సాగించింది.

మా పెద్ద అమ్మాయీ, చిన్న అమ్మాయీ కూడా అక్కడే ఉన్నారు. వాళ్ళంతాకూడా తల్లితోపాటు నా వంకజూచి విపరీతంగా నవ్వటం సాగించారు.

"గుర్రానికి మూడు కాళ్ళు ఉన్నయ్యర్రా. ఎందుకు అల్లాగ నవ్వుతారు" అని నేను విసుక్కుంటే వాళ్ళు మరీ నవ్వారు.

అందుకని వాళ్ళతో మాట్లాడటం మానేసి పైవాక్యం చదవరా నాయినా అన్నాను రాధాయతో.

"గుర్రానికి రెండు చెవులున్నవి. కాని కొమ్ము లుండవు" అని మళ్ళీ వాడు చదివాడు.

"అబ్బాయికి ఎన్నెన్ని విషయాలు నేర్పుతున్నా రండీ! ఎందుకు వెధవపురాణాలు!! గుర్రానికి నాలుగు కాళ్ళు!! రెండు చెవులు!!" అంటూ అవిడ వెక్కిరిస్తూ ఉంటే నాకు కాస్త కష్టంగానే ఉంది.

అప్పటికి నాకు తెలిసింది వాళ్ళు ఎందుకు నవ్వుతున్న దీని, అవేమీ గొప్ప సంగతులు కావని వాళ్ళు వేళాకోళం చేస్తున్నారు.

అందుకని నేనన్నానూ "ఇందులో విషయం కాదు నీవు చూడాలిసింది. వాక్యరచన" అని తెలియ చెప్పాను "ఓహో అల్లాగా" అని అప్పటికి ఊరుకొంది.

"నువ్వు చదవరా నాయినా మీ అమ్మకేం తెలుసు అల్లాగే నవ్వుతుంది" అన్నాను. మా రాధాయ మళ్ళీ, చదివాడు, "గుర్రము వైద్యమునకు పనికివచ్చును" అని.

వైద్యానికి పనికిరావటం ఏమిటి అని నేను అనుకుంటూ ఉండగానే, "గుర్రాన్ని నూరి మందులో వేస్తారా ఏమిటీ" అంటూ ఆవిడ మళ్ళీ విరగబడ్డది.

ఇల్లాగ నవ్వటం మా రాధాయకూడా ఒప్పుకోలేదు ఈ పర్యాయం. "వినవే అమ్మా అశ్వముయొక్క గంధమునుండి అశ్వగంధాది లేహ్యమును తయారుచేయుదురు" అని చదివి విని పించాడు. ఈతఢా నేనుకూడా నవ్వక తప్పిందికాదు.

ఇక ఆవిడ ఉప్పెనగా నవ్వింది. "అశ్వము యొక్క గంధం ఏమిట్రా నాయినా అదెల్లా వుంటుందిరా" అననూ నవ్వనూ.

మా అబ్బాయి వాక్యరచన బాగానేఉంది. పదింటికి ఆరు మార్కులు ఇవ్వవచ్చును. కాని మా ఆవిడ నవ్వటంవల్ల నా మనస్సు చెడిపోయింది. కుక్కమీదకూడా పాఠం చెప్పదల్చు కొన్నవాణ్ణి ఆరోజుకు చెప్పడమే మానేశాను.

## 13

కాంతానికి తెల్లచీరలంటే ఎక్కువ ఇష్టం. ప్రొద్దు గూకుటూ ఏ రంగుచీరో కట్టుకున్నా సాయంత్రానికి మాత్రం తెల్లచీర కట్టేది. మల్లెపూవులన్నాకూడా ఆమెకు ఎంతో ఇష్టం.

ప్రతిరోజూ భోజనానంతరం ఆవిడ దేవకన్యలాగ నా గది లోకి వచ్చేది. జరీ అంచు తెల్లని రవిక తొడుక్కొని జడలో అర్ధచంద్రాకారంగా పూలు పెట్టుకుని మంచినీళ్ళ చెంబుతో ఆవిడ మెల్లగా వస్తుంటే, క్షీరసాగరంలోనుంచి లక్ష్మి లేచి వస్తున్నట్లు ఉండేది.

ఒక్కొక్కరోజున నే నేదో తీవ్రమైన ఆలోచనలో ఉండి ఆవిడ రాకను గమనించనట్లు నటిస్తాను. నిశ్శబ్దంగా ఆవిడ నా వెనుకవైపునకు వెళ్ళి తన మృదువైన హస్తాలతో నా కళ్ళు మూసేది. ఇంట్లో ఇంకెవ్వరూ లేరు. అప్పటి కింకా సంతానం కలుగలేదు. రాత్రివేళ ఎవ్వ రొచ్చి నా కళ్ళు మూయటానికి సాహసిస్తారు,

ప్రతిరోజూ జరిగే పనికూడాను. అయినా నేను ఆ కళ్ళు మూసింది ఎవరో కనుక్కొంటానికి నానాఅవస్థాపడి, కనకమ్మ, కమలమ్మ, పద్మావతి అంటూ ఏవో వచ్చిన పేర్లన్నీ చదివి చివరకు 'కాంతం' అనేవాడ్ని. ఆవిడ కిలకిలా నవ్వుతూ, చెయ్యి తీసివేసేది. ఈ చిన్న నాటకం రోజుకోసారి తప్పదు.

ఒక్కొక్కరోజున ఆవిడ దీపం చటుక్కున తగ్గించివేసి. నా చేతులో ఉన్న పుస్తకాన్ని లాక్కొని బల్లమీద పెట్టి, తన జడకుచ్చులతో నా ముఖాన్ని, బుగ్గలను, కళ్ళను తాకి, ఆ తరు వాత ఆ జడను నామెడకు చుట్టబెట్టి లాగేది. ఇల్లాంటివి కామ క్రీడలనీ వాత్స్యాయనుడు వర్ణించాడు. మా కాంతానికి ఇల్లాంటి వన్నీ ఎల్లాగో తెలిసినై చదువుకోపోయినా, చదువుకోకుండానే తెలుస్తయ్యేమో ఇవన్నీ !!

దీపం తగ్గిస్తే, నేను అనేవాడ్ని "చూడూ కాంతం దీపం తగ్గించకు."

"ఎందుకూ!"

"ఎందుకంటే, ఎందుకంటే" అంటూ నేను తల గోక్కునే వాడిని. ఎందుకో చప్పున జ్ఞాపకం వచ్చేదికాదు. చాలా కష్టపడి జ్ఞాపకం తెచ్చుకొని చివ్వరకు అనేవాడిని "నిన్ను కాస్త లైటులో చూడనియ్యి" అని.

"ప్రొద్దస్తమానం చూడలేదండీ, ప్రొద్దున్న కాఫీ ఇయ్యటానికి వచ్చినప్పుడు చూస్తిరి, స్కూలుకు వెళ్ళేముందు కిటికిలో నుంచి చూస్తిరి. రోడ్డుమీద నడుస్తూ, తిరిగి తిరిగి చూస్తిరి సాయింత్రం చూస్తిరి. ఇంకా ఏమిచూస్తారండీ" అని అంటూ ఆవిడ విరగబడి నవ్వేది.

నిజానికి నాకు ఆవిడను అన్నిసార్లు చూచిన జ్ఞాపకం ఏమాత్రం ఉండేదికాదు. నేను తెల్లవోయి ప్రొద్దున నిన్ను చూశానా అనే వాడిని, "ఏమి విచిత్రమండీ నన్నుగాక ఇంకెవ్వరిని చూస్తున్నారండీ ఈ ఇంట్లో" అనేది.

"అహా అది కాదు. ప్రొద్దున్న నీ జడ అంతఅదంగా లేదు."

"అంటే ఇప్పుడు పూలుపెట్టుకొన్నాను."

"ఇంతకు పూర్వం, నీకళ్ళు అంత ఆకర్ణాంత విశాలములై తేజఃపుంజములు గాలేవు,

"అబ్బ! ఏమి కవిత్వం అండీ. కాస్త కాటుక పెట్టుకొంటే అల్లాగే కనిపిస్తయి." అంటూ సిగ్గుపడి తల వంచుకొనేది,

"అసలు ఇంతకుపూర్వము నీవు ఇంత అందంగా ఎప్పుడూ లేవు'' అని నేను ఆవిడను దగ్గరకు తీసుకొనేవాడిని. ''మీదంతా కవిత్వమండీ! అయినా వేళావిశేషంలెండి! ఈ వేళప్పుడు నేను ఇల్లాగే కనపడతా'' అంటూ ఆవిడ నా బుగ్గపైన చిటిక వేసేది. వళ్ళు ఝల్లుమని పులకలు తేలేది. రోజెల్ల గృహకార్యాలయందు నిమగ్నయై ఉండే ఈ సామాన్య గృహిణి ఆ సమయానికి మోహనమూర్తి ఎల్లాగు అయ్యేదో! ప్రొద్దుగూకూలూలేని సిగ్గు ఆవేళకు ఏజ్యోత్స్నాతరంగములపైనుండి జారి ఆమె పెదవులను, కపోలములను, బుగ్గలను అవరించేదో!!

కళకళ లాడుతూఉండే ఆరామంలోకి నన్ను ఆహ్వానిస్తూ స్వాగతం ఇచ్చే వసంత కోకిలా కలకంఠ గాన మాధుర్యమూ,

ఎండకాలంలో రాత్రంతా నిద్దరపట్టక పట్టక ఏ కునుకో పట్టినప్పుడు, మంద మంద హస్తాలతో జోకొట్టే ప్రత్యూష పవనాల శీతల స్పర్శా.

వెన్నెల్లో తెల్లని పాన్పుమీద శరద్రాత్రి అంతా గడిపి తూర్పురేఖలు తెల్లవారే సమయాన లేవబోతున్నపుడు వద్దు వద్దని హత్తుకొనే మా కాంతము గాఢ సంశ్లేషా నా కెప్పుడూ జ్ఞాపకానికి వస్తూఉంటై. జీవితము నిస్సారము అని తోచినప్పుడల్లా.

## 14

భార్యా పిల్లలతో కూడిన సంసారంలో వుండే కష్టసుఖాలను అనుభవించి, ఆనందించలేకపోతే ఇంక దేన్ని చూచి ఆనందించగలము?

హృదయం వుండి నిజంగా అనుభవించగలవాడికి పిల్లలు గల యిల్లు స్వర్లోకంలోని నందనవనంకంటె హాయినిస్తుంది.

సుకుమార సుందర దళాలలో వికసించిన గులాబీ పువ్వుకు తొడిమదగ్గఱ ఒకటిరెండు ముళ్ళు ఉన్నంతమాత్రంలో దాని సౌరభమూ, సౌందర్యమూ, మార్దవమూ ఆకర్షించడం మానాయా ?

ఆ విధంగానే సంసారంలో కష్టాలు సుఖానుభూతికి దారి చూపించే దీపాల కాంతులేకాని మఱొకవిధంగా బాధపెట్టేవి కావు.

చూడగలవాడికి ప్రకృతిలో అందం అంతా యింట్లో కనబడుతుంది.

పసికూనల చిట్టిచేతులను చెక్కిళ్ళకు తాకించుకోడం ఆనందాన్ని యివ్వకపోతే మల్లికా ప్రసూనశోభా సౌందర్యము ఆనందాన్ని ఇస్తుందా ?

పసిదాని బుగ్గలు ముద్దాడి పరవశం చెందలేనివాడు శిరీష కుసుమ సౌకుమార్యం ఏ మనుభవించగలడు ?

మృణాల నాళాల కంటే మృదువులైన చేతులను మెడచుట్టూ వేసి పసిబిడ్డ వలకపోసే బోసినవ్వుల హారాలకంటే హిమబిందు మౌక్తికా హారము హాయినిస్తుందా ?

రెమ్మ రెమ్మనూ పూచిన తీవలా కేకింతలాడే పిల్లలతో నిండిన యిల్లు కలకలలాడుతూ కనపడడం లేదూ !

వసంతకాలంలో సీతాకోక చిలుకలు పువ్వు పువ్వు దగ్గఱకూ పోయి క్షేమసమాచారా లడిగి పలకరించి వస్తాయి.

లేమావి చిగుళ్ళతో సంతృప్తిపొంది ఏ గుబురు చాటునో ఏకాంతముండి కోయిలలు పంచమస్వరంలో హృదయ పూర్వకంగా ఎవరినో ఆహ్వానిస్తూ ఉంటాయి.

ఇవీ లేకపోతే వసంతమే కాదు. వసంత కాలానికి శోభే లేదు. అల్లాగే కిలకిలలాడుతూ గంతులువేసే పిల్లలున్నూ కిచకిచలాడుతూ చూర్లలో అల్లరిచేసే పిచ్చికలున్నూ లేనియిల్లు ఇల్లే కాదు అంటుంది మా కాంతం.

తన పిల్లలను చూచి ఆనందిస్తుంది, ప్రపంచమంతా తన యింట్లోనే చూస్తుంది. నిత్య పరితృప్తిలో దేవతా మూర్తిలా వెలుగుతూ వుంటుంది. తన బిడ్డలను గురించి ఎన్నో తియ్యని కలలు కంటుంది. అబ్బాయి డిప్యూటీ కలెక్టరు చేస్తాడనీ, అమ్మాయి జమీందారుగారి భార్య అవుతుందనీ ఆమె అనుకుంటూ ఉంటుంది.

ఒకసారి మా అబ్బాయి చిఱునవ్వుతో పరుగెత్తుకుని వచ్చి నా వొళ్ళో కూర్చున్నాడు. వాడిని మనసారా హృదయాని కదిమి పట్టుకుని పుత్రగాత్ర పరిష్వంగ సౌఖ్య మనుభవిస్తూ మాటి మాటికీ ముద్దుపెట్టుకుంటూ ఆనందాన్ని పట్టలేక కాంతం! వీడు ఎట్లా పుట్టాడే! ఇంత చక్కనివాడు. ఈ దొరబాబు'' అని అడిగాను.

ఈ ప్రశ్నకు ఏం జవాబు చెవుతుంది ఏ ఇల్లాలైనా! మొదట మా ఆవిడ తెల్లపోయింది. కానేపుండి తెప్పరిల్లి పిల్లవాడ్ని తన చేతుల్లోకి తీసుకుని ఎగరవేసి ముద్దాడుతూ ''వీడా! వీడు మన పూర్వజన్మ సుకృతం వల్ల పుట్టాడండీ'' అన్నది.

# 15

కాంతా ప్రణయ కథలలో కాలచక్రం గిరా గిరా తిరిగి పోయింది. పదిహేను సంవత్సరాలు ఇట్టే గడిచి పోయాయి. అనుభూత జీవితం అంతా సుఖస్వప్నం అయింది, కొంత స్మృతిపథంలోనుంచి జారిపోయిందికూడా!

కాని అప్పుడప్పుడు ఏదో మధురానుభవము చప్పున అగాధ స్మృతి తలాల్లోనుంచి పైకి తేలుతుంది. ఒకప్పుడు అది అవ్యక్తమై హృదయంలో ఎక్కడో, దూరాన ఒక చిన్న తరంగంవలె స్మృతికి తాకుతుంది. మరొకప్పుడు మధురాతి మధురానుభూతి సువ్యక్తమై మనస్సుకుతోచి చక్కలికింతపెట్టి సుళ్ళుతిరిగి ఆనందాన్ని ఇస్తుంది.

ఒకరోజున ఆమె జరీచీర కట్టుకొని, వెడల్పైన జరీఅంచు గల తెల్ల రెవిక తొడుక్కొని జుట్టులో అర్ధచంద్రాకృతిగా మల్లెపూలు పెట్టుకుని అకాశంనుంచి సన్నగా జారిన శీతాంశు కిరణంలా మెల్లగా వచ్చింది గదిలోకి. నాకు ప్రథమ పరిచయం జ్ఞాపకానికి వచ్చింది. ''కాంతం!''—అని ఆమెను అట్లాగే తేరిపార చూశాను బహుకాల తపఃఫలముగ ఈశ్వర సాక్షాత్కారం కలిగిన భక్తుడు చూచినట్లుగా.

''ఎందుకండీ అల్లా చూస్తారూ?'' అన్నది.

"నీవు మొదటి రోజున సరీగా ఇలాగే కనపడ్డావ్ కాంతం?''

''మొదటిరోజున అంటే?'' అని అడిగింది.

"నువ్వు నా మీదికి వంగావు జ్ఞాపకం వుందీ! ఆ రోజున" అన్నాను. కాంతం సిగ్గు ముసుగులో కుంభించుకుపోతూ ముఖం మాత్రం కొద్దిగా పైకెత్తి చిరునవ్వులో కనికరించింది. నేను ఊరుకోక మళ్ళీ అడిగాను "ఎందుకు కాంతం! ఆ రోజున అల్లా వంగావు" అని.

"సాదు బరిణకోసం" అని అన్నది కాంతం.

"సాదు బరిణకోసం మొగుడిపైకి వంగుతారా అంతానూ?"

"పోనీలెద్దురూ! మీరు చేసిన పనిమాత్రం బాగుందికామాలు. అప్పుడు నేను కాపరానికి రాని పిల్లనేకదా! మీరు మా తమ్ముణ్ణి ఎందుకు అడిగారూ 'మీ చిన్నక్కయ్య ఎక్కడుందిరా' అని. వాడి చిన్నక్కయ్యతో మీ కేంపని చెప్పండి నిజానికి?"

"అందులో తప్పు ఏమాత్రమూలేదు. ఊరికే అడిగాను."

కాంతం కళ్ళు మూతీ తిప్పుతూ హేళనగా అన్నది "పాపం! ఊరికేనే అడిగారేం? వట్టి నంగనాచి. నోట్లో వేలుపెడితేకూడా కొరకలేరు" అన్నది విరగబడి నవ్వుతూ.

"అట్లా అంటావనేగా నీ వేలొకసారి కొరికానూ?"

"ఒక్కసారి వేలుకొరికారు. దాని తరువాత........"

"అదేమిటీ! దాని తరువాత మళ్ళీ నీ వేలెప్పుడూ కొరక లేదే!"

"ఆ! వేలు కొరక్కపోతేఏం! వొళ్ళంతా కొరికారు!" అని నవ్వింది.

ఇద్దరం కొంతసేపు నవ్వుకొన్నాము. తరవాత కొంచెంసేపటికి "మీ దసలు చాలా కొంటెతనమండీ!" అన్నది.

"ఏం?"

"ఆరోజున మధ్యాహ్నం పీటలమీద గూర్చున్నప్పుడు ఎవ్వరూ చూడకుండా చిటికెనవేలు పట్టుకుని లాగారు ఎందుకు చెప్పండి" అన్నది సిగ్గుతో తల వంచుకుని.

"నేనా లాగింది, నువ్వుకదూ? ఎందు కబద్ధ మాడతావు? ఆడపిల్లలు పుడతారు."

"మొగపిల్లలుగూడా పుట్టుకొచ్చారు. కాబట్టి నాది అబద్ధం కాదని తెలుస్తూనేవుంది."

"సరే! నేను చిటికెనవేలు లాగితే నువ్వు ఎందుకు వూరుకున్నావు? అది చెప్పుపోనీ!"

"ఊరుకోక ఏంచెయ్యాలేమిటి?"

"మీ అమ్మతో చెప్పాలిసింది. లేకపోతే పెద్దగా కేకవేసి అందరితో చెప్పి నన్ను పదిమందిచేతా చీవాట్లు వేయించాలిసింది."

కాంతం నవ్వింది. "అంతపని చెయ్యలేదు. కాని అక్కయ్యతో చెప్పాను."

"ఏమిటీ? ఈ సంగతి నాతో నువ్వెప్పుడూ చెప్పనేలేదే! అక్కయ్యతో చెప్పావు? చెపితే మా వదినెగారు ఏమన్నదీ తద్విషయంలో:"

"మీదే తప్పు అన్నది."

"నాదే తప్పు—ఆ సంగతి అప్పుడే చెప్పినట్లయితే క్షమించమని ఆమె పాదపద్మములకు ప్రణమిల్లేవాణ్ణే."

"క్షమించమని అడిగినా అసలు క్షమించేదికాదు."

"ఎందుచేతా! అంత క్షమించరాని తప్పు అన్న మాటఅది."

"అక్కయ్య అట్లాగే అన్నది."

"ఇహ అక్కయ్య అంటే ఆప్పీలులేదు. మరి ఆ తప్పి దానికి నన్ను శిక్షించమనలేదూ?"

"మిమ్మల్ని కొట్టమన్నది అల్లాంటిపని ఎప్పుడూ చెయ్యకుండా."

"కొట్టకపోయినావూ? బుగ్గలు సాగదీయకపోయినావూ? చెవులు మెలివేయకపోయినావూ?"

"ఆ! ఎందుకని క్షమించాను."

"అబద్ధంగూడా ఎందుకు? ఆరోజునే జడ కుచ్చులతో కొట్టావు. ఒక రోజున బుగ్గలు సాగదీశావుకూడా? అసలు నీవు పెండ్లిరోజునే గంధం పూస్తూ చెంపమీద చటుక్కు మనిపించావు ఇల్లాగ" అని ఆమె బుగ్గలు తాకాను.

ఆమె సిగ్గుపడి "మీరుమటుకు ఏమీ ఎరగనట్లు! నాకు మెడలో గంధం పూస్తూ మూతికి పూయలేదుటండీ" అన్నది.

"చిన్నతనం. అప్పుడు బొత్తిగా చిన్నతనం" అన్నాను.

"అప్పుడు చిన్నతనం అయితే ఇప్పటికీ చిన్నతనం పోలేదు మీకు!"

"ఏంజేశానే కాంతం. అల్లా అన్యాయంగా అంటావూ?"

"మొన్ననేగదండీ! వంటయింట్లోకి పోతూ పోతూ నన్ను తోసుకుని పోతిరి!!"

"దారిలో ఉండి కదలకపోతే తప్పనిసరిగా తాకాలిసి వచ్చింది మడికట్టుకున్నదాన్ని! ఏంజేసేది?"

"పాపం! ఎన్నిసార్లు ఇల్లాగ తప్పనిసరి అయిందో!" అంటూ విరగబడి నవ్వింది కాంతం.

ఇక నవ్వలేక పక్కపైన పడుకుంది.

మా కాంతం ఆరోజున మళ్ళీ స్వర్లోకాలనుంచి దిగివచ్చిన దేవతలా కనిపించింది. గుంటలుపడే ఆ చెక్కిళ్ళు, చిక్కినా, నీటి బుడగల్లాగ మనోహరంగా వున్నాయి. తలలో ఒకటి రెండు తెల్ల వెంట్రుకలు మెరుస్తున్నా ఆమె కేశముల సౌందర్యం తగ్గ లేదు. మెలికలు చుట్టుకున్న నల్లత్రాచులాగ ఉంది ఆమె కేశ బంధము. ఆమె పడుకున్న శయ్య పదిహేనుఏండ్ల సౌఖ్యజీవి తాన్ని జ్ఞాపకం చేసింది.

ఆమె కబరీచ్యుతమల్లికా కుసుమాలు ఇంతకంటే నీ జీవితా నికి సౌఖ్యం ఎప్పుడు? అన్నట్టుగా వికవిక నవ్వినై.

ఏదో సుఖస్వప్నం కంటున్న దానివలె అరవిచ్చిన తమ్మి మొగ్గలవలె కళ్ళు పెట్టుకుని మత్తుగా నావంక చూస్తుంటే ఆ కళ్ళల్లో పదిహేనుఏండ్ల దివ్య దాంపత్యం లీలగాతోచింది— తొంగి చూచింది—కలకలలాడింది—సాక్షాత్కరించింది.

వళ్ళు ఉప్పొంగింది. జవజవలాడింది. వానచినుకు పడగానే మొలకెత్తిన వరినారు మడిలా శరీరమంతా పులకరించింది. నా తనువు పాలసముద్రం మధ్యనుంచి అమృతంతోపాటు లేచి నట్లు తోచింది. ఆనందోద్రేకంతో అతి నిశితంగా ప్రసరించిన చూపులతో ఆమె కనుపాపల్లో నా నీడ చూచుకుంటూ చేతులు చాచి కాంతాన్ని దగ్గఱకు తీసుకుని ముఖంలో ముఖంపెట్టి

"అవునుగాని కాంతం! నీవు నా కెక్కడ దొరికావు?" అని అడిగాను.

ధ్యానంనుండి బైటికి వచ్చిన నిత్యానందం అనుభవించే యోగిలా నా వంక చూస్తూ "ఎక్కడా దొరకలేదు. మీరు నాకూ దొరకలేదు. నేను మీకూ దొరకలేదు. మనం ఎప్పుడూ ఇంతే!" అని ఆవిడ నన్ను కౌగిలిలోనికి తీసుకుని తనలో ఐక్యం చేసుకొంటున్నట్లు హృదయానికి హత్తుకున్నది.

మే మిద్దరం ఇంతేనట! అంటే ఈ దాంపత్యం జన్మజన్మాలనుంచీ ఇలాగే వస్తున్నది అని కాబోలు ఆమె ఉద్దేశం. వాల్మీకి ఇంతకంటే ఎక్కువ సత్యాన్ని చెప్పాడా సీతారాముల దాంపత్య కథనంలో!

## 16

మా కాంతంతో సాంగత్యం నా శుష్క జీవితానికి అమృత భాండమైంది. ఆమె పవిత్ర నామము. ప్రేమపూరితము, మధురము శక్తివంతము. జీవితంలోని మాధుర్యమూ, అందమూ, సౌఖ్యమూ అన్నీ ఆ పేర్లోనే ఇమిడి ఉన్నాయి నా దృష్టిలో.

ఇప్పుడు ఆమె పేరుతో గత జీవితాన్ని అవలోకిస్తే మధుర స్మృతి లుగుతూ ఉంటుంది.

మొదటి రోజుల్లో ఆమె తనుద్యుతీ, కుటిలాలకలూ, సుదీర్ఘ నీలశిరోజాలూ, నవ్వువెన్నెలలూ, మెఱుపు చూపులూ, తీర్చి దిద్దిన ముఖవికాసమూ ఇవి నన్ను ఆకర్షించి ఆనందాన్ని ఇచ్చాయి తరువాత ఆమె పిల్లలతల్లి అయింది. యౌవనపు పొంగు పోయింది.

ఆమె శరీర విన్యాసంలో వంపులమీదా, రేఖల మీదా, నునుపుమీదా, పసిమిసొగసా ఉన్న తీవ్రమైన మోహము సన్న గిల్లింది. అప్పుడు ఆవిడ స్వభావం, ప్రవర్తన, ప్రేమా, చమత్కార సంభాషణ ఇవి ఆనందాన్ని ఇచ్చి మా దాంపత్యంలో ఉండే విలువను హెచ్చించినై.

సూర్యుని మధ్యాహ్న తేజస్సు దివ్యమైనదే! ఆ తేజస్సు పోతుంది. కాని దిగులు పడాలిసిన అవసరం ఏమీ లేదు. చల్లని సాయంకాలంలో దేవలోకంలోని వీధులవలె ఆనం దాన్ని ఇస్తుంది.

శ్రావణమాసంలో మహానది ఒడ్డుల నొరసికొని ఉద్రేకంతో ఆ వేగంతో ప్రవహిస్తుంది. ఆ నడకలో అందం ఉంది. అదే నది కార్తికమాసంలో తన గర్భంలో దాచిఉంచుకొనిన శిలా శిశువులను చూపుతూ వాటి చుట్టూ ప్రేమతో ప్రశాంతంగా తిరుగుతూ ముద్దుపెట్టుకుంటూ పరిష్వంగ సౌఖ్యం అనుభవిస్తూ ప్రవహిస్తుంది. ఆ నడకలోనూ అందం ఉంది. కాంతం జీవితంలోకూడా అల్లాగే యౌవనం పోయిన తర్వాత ప్రశాంతతా గాంభీర్యమూ అలుముకున్నాయి. అవయవములు తట్టుకోలేని శక్తివంతమైన యౌవనం లోనూ అందం ఉంది. ఆ పొంగు

పోయినతర్వాత జీవితానికి వచ్చే తృప్తి. గాంభీర్యము, శాంతము వీటిలోనూ అందం ఉంది.

సాయంకాలపు రంగురంగుల మేఘాలలో ఉండే అందం, గమనం, గంభీరమై రాత్రిలో ఉండే మనోజ్ఞతా ఆవిడ ఉత్తర జీవితంలో ప్రకాశించినై. అవే జీవితానికి సంతోషాన్ని ఇచ్చినై.

ఆ ఉత్తర జీవితంలో ఒక క్రొత్తరకం అందం ఆమెలో నాకు కనిపించింది. ఆ సౌందర్యం ఆమె జుట్టులో నవ్వుల్లో మెఱుపుల్లో నాకు కనిపించలేదు. వీటి కన్నిటికీ అందనిది, వీటికి అతీతమైనది. ఆత్మకు మటుకు ద్యోతకమయ్యేది. ఎన్నో పూర్వజన్మలకు సంబంధించినది అయిన సౌందర్యం ఆమెలో ప్రకాశించింది.

ఆమె శాంతంగా బ్రతుకు వెళ్ళబుచ్చుకొన్నది. తన జీవితంలో తాను పొందవలెనని ఎంచుకొన్న ఆదర్శాలకు అన్నిటికీ భ్రమల మూలంగా తృప్తి కల్పించుకొన్నది. భర్త సుందరమూర్తి అని భ్రమ కల్పించుకొన్నది. అల్లాంటిశక్తి ఉంటే మనిషికి ఇంకేం కావాలి. నేను హాయిగా ఉన్నాను. నాకు ప్రపంచం అంతా ఆనందమయంగా ఉంది అని అనుకోకలిగిన మనఃప్రవృత్తే ఉంటే ఇక ఏమీ అక్కరలేదు. ఋషులు అనుభవించిన ఆనందం అల్లాంటిదే! తన భర్త సుందరమూర్తి అనుకొన్నది. ఆ భ్రమ తోనే ఆనందంగా తృప్తితో ఈ భూమిమీద ఉన్న నాలుగు రోజులూ కాలం గడిపింది. లేనిపోనిది, ఎక్కడా దొరకని అసత్యమైన సౌందర్యం కోసం అన్వేషించి, దాన్ని పొందలేక ఏడవలేదు.

సహజంగా స్త్రీ హృదయంలో ఉండే సౌందర్య తృష్ణకూ ఆత్మకు వికాసాన్నీ తృప్తినీ ఆనందాన్నీ ఇచ్చే అనుభూతి కొఱకై హృదయం పడే ఆరాటానికీ ఆమెకు శ్రీకృష్ణభగవానుఁడే స్థానమైనాడు. పూర్వజన్మ సంస్కారంవల్ల లభించిన ఆ భక్తి శరద్రాత్రి వెన్నెలపై నుండి జారు హిమబిందువు మల్లె పువ్వును వికసింపఁ జేసినట్లు ఆమె హృదయాన్ని వికసింప జేసింది. ఆమె సర్వస్వము రాధికావల్లభుడికి అంకితం చేసింది. కాబట్టి ఆమె జీవితంలో అసంతృప్తి యెరుగదు.

ఆవిడ జీవితం అంతా త్యాగమే. భర్తకూ, పిల్లలకూ సేవ చెయ్యడంలో ఆవిడ తన సౌందర్యమూ, యౌవనమూ, సౌఖ్యమూ అన్నీ త్యాగంచేసింది. మందమారుత స్పర్శచే వికసించి యువతీ ధమ్మిల్లవిభూషయై చిట్టచివరకు భార్యా భర్తల అన్యోన్య గాఢాలింగన సంరంభములలో నలిగిపోయి తన జీవితాన్ని అర్పించిన మల్లికా ప్రసూన జీవితం మా కాంతం జీవితం కూడా. మల్లెపూవును నిర్దయతో కోసి, బుట్టలో అదిమి, సూదితో గుచ్చి ఎంత బాధపెట్టినా సాయంత్రాని కల్లా బాధలన్నీ మరచిపోయి హృదయాన్నంతా విచ్చి వికసింపజేసి పరిమళాన్ని వెదజల్లుతుంది. కాంతమూ అంతే. పగలంతా పిల్లలకూ, భర్తకూ కావలసిన సేవజేసి కష్టాలు మరిచి సాయంత్రానికల్లా వికసించిన మల్లెపువ్వు అయ్యేది.

ఆవిడ నా జీవితానికి దివ్యజ్యోతి. జీవితంలోని కష్టానుభూతి తీక్ష్ణతపాలకు ఆర్ద్రతను పోగొట్టుకొని శతధావిభిన్నమైన నా హృదయ క్షేత్రానికి ఆమె అమృతవాహిని. చీకటిలో దేవులాడు

తున్న నా బ్రతుకుకు ఆమె ధృవతార. నాకు తల్లి, సహోదరి, భార్య—అన్నీ ఆమెగానే ఉండేది.

పసిపిల్లవాడికి తల్లే లోకం. ఎంతసేపూ వాడు తల్లిచుట్టూ తిరిగి దాగుడుమూతలాడి నవ్వి ఆనందిస్తాడు. నా జీవితం అల్లాగే అయిపోయింది. నా బ్రతుకు బ్రతుకంతా కూడా ఆవిడచుట్టూ తిరిగి ఆడుకునే దాగుడుమూతలాట అయింది.

సాయంత్రం ఆకాశం ఎర్రమబ్బులతో మనోహరంగా ఉండి స్వర్గసీమల ద్వారాలు తెరుచుకొని గులాబీపూల వీధులు కనపడ్డప్పుడు, దేవతల కళ్ళ మెఱుగులు మిణుగురు పురుగుల తళతళలుగా కనపడ్డప్పుడు మా కాంతం జ్ఞాపకానికి వస్తుంది.

ఎంత బుద్ధిహీనుడో ఆ భగవంతుడు! తాను నిర్మించిన సుందర భవనంలో ఉండే అతి సుందరమయిన వస్తువును కూలాచ్చాడు.



## మునిమాణిక్యం నరసింహారావుగారు

కాంతం కథకులనే పేరుతో ప్రసిద్ధులైన మునిమాణిక్యం నరసింహారావుగారు 1898 లో గుంటూరు జిల్లాలో సంగం జాగర్లమూడి గ్రామంలో జన్మించినారు. గుంటూరులోనూ, విజయనగరంలోనూవిద్యాభ్యాసంచేసినారు.(బి.ఏ.ఎల్.టి.) బందరు హిందూ కాలేజి హైస్కూలులో చాలకాలము చరిత్రోపాధ్యాయులుగా పనిచేసి రిటైరు అయి విశ్రాంతి పుచ్చుకొంటున్నారు.

మునిమాణిక్యంవారిని చూచి ముసిముసి నవ్వు నవ్వని ఆంధ్రుడు ఉండడు. వీరి రచనలు అన్నీ నవ్వించేవే! గృహ జీవితములోని కళాప్రసక్తములైన రసవద్వినోద కలాపాలను కథావస్తువుగా తీసుకొని ఇరవై అయిదు గ్రంథములు వ్రాసినారు. గార్హస్థ్య జీవిత సౌందర్యమును మనో హరంగా ఆవిష్కరణ చేసినారు. ఆంధ్రుల అభిమాన కథకుడు. "కాంతం కథ వ్రాస్తే మునిమాణిక్యమే వ్రాయాలె. మునిమాణిక్యం వ్రాస్తే కాంతం కథ వ్రాయాలి" అన్నారు విమర్శకులు. వీరివలె సాంసారిక జీవితములోని రమణీయ దృశ్యాలను చిత్రించినవారు ఇంకొకరు లేరు.

